

మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street, Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

# విరిసి మెరిసిన చిన్నారి

ప్రగతి నట్వర్ భట్టాడ్‌ను నిజంగానే అద్భుత బాలికగా చెప్పవచ్చు. కర్నాటక గవర్నర్ శ్రీ రామేశ్వర్ ఠాకూర్ 2008 నవంబర్ 20న చిన్నరహబ్బలో ఈమెను అద్భుత బాలికగా గుర్తించి సత్కరించారు.

అసాధారణ జ్ఞాపకశక్తి ప్రగతి స్వంతం. నాలుగేళ్ల వయస్సులో ఈ చిన్నారి 196 దేశాల రాజధానీ నగరాల పేర్లు అలవోకగా చెప్పేది. అలాగే 28 భారతీయ రాష్ట్రాల రాజధానులను కూడా గడగడా వల్లించేది. రాశులు, గ్రహాల పేర్లను కూడా ఊపిరి పీల్చకుండా చెప్పేది. అలాగే 2010 ఆగస్ట్ నెలలో చెన్నయ్‌లో జరిగిన జాతీయ స్థాయి అబాకస్ పోటీల్లో ప్రగతి తొలి రన్నర్‌గా నిలిచింది. చదువుకునేటప్పుడు కూడా అబాకస్ సూత్రాలను అన్వయించేది. దీంతో గణితంలో ఈమె చక్కని ప్రావీణ్యత సాధించింది. విద్యలోనూ, ఇతర కార్యక్రమాల్లోనూ ఈ చిన్నారి చక్కటి సమన్వయంతో వ్యవహరిస్తోంది.

ప్రగతి ఒక సామెతను బాగా విశ్వసిస్తోంది.. 'ఎప్పుడూ పని చేస్తూ ఆటలాడకపోతే సోము డల్ బాయ్ అయిపోతాడు.' కాబట్టి ప్రతిరోజూ ఏదో ఒక ఆట ఆడి తీరతానని ప్రగతి చెబుతోంది. మంచి భవిష్యత్తు తన ముందుండటంతో, ప్రగతి జీవితంలో విజయం పొందడానికి అవసరమైన అన్ని గుణాలను సంతరించుకుని ఉంది. ఈ నెల ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు.



May 2012 ₹20/-

*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 May 2012 Issue-05

# మామిడిపండ్లూ... సెలవులూ... చందమామా...

సెలవులు వచ్చేశాయి, ఇది అందరూ ఆస్వాదించే సమయం. ఎప్పటిలాగే కొత్త ప్రాంతాలు సందర్శించడం, చుట్టాలను కలవడం, స్నేహితులతో ఆడుకోవడం, బుల్లి తెరను చూడటం.. వంటి పనులకు సిద్ధమవుతుంటాం. ఈసారి వీటితో పాటు మరికొన్ని పనులు చేద్దాం. మనందరమూ ఆస్వాదించేటటువంటి చక్కటి కథలు, అనుభవాలను తెలుపవలసిందిగా పాఠకులను కోరుతున్నాము. గతంలోనే మేము సూచించినట్లుగా మన నివాసస్థలం మిత్రులు, దేశం కోసం ఉపయోగపడేలా ఏదయినా చేయాలి. మన చిన్నారి మిత్రులకు, చూపు లేని కారణంగా ప్రపంచంలోని అందాలను ఆస్వాదించలేని మనలోని కొద్దిమంది దురదృష్టవంతులైన స్నేహితులకు చందమామ కథలను చదివి వినిపిద్దాం. కొన్ని మొక్కలను నాటుదాం. కొన్ని బొమ్మలను తయారు చేద్దాం. పాఠశాలను శుభ్రపరచి, రంగులద్దడానికి మనం చదివిన పాఠశాలకు ఏదయినా స్వచ్ఛందంగా సహాయం చేద్దాం. సెలవురోజుల్లో మనం చేయవలసిన పనులు చాలానే ఉన్నాయి. దీంతో మనకు ఆహ్లాదం కలగటమే కాదు... మన సమాజానికి కూడా కాస్త సహాయం చేసినట్లుంది కదా!

గత సంవత్సరం జపాన్ ప్రకృతి వైపరీత్యాన్ని చవి చూసింది. భూకంపం, దాని వెన్నంటే వచ్చిన సునామీ తదనంతరం దుష్ప్రభావాలను జపాన్ నేటికీ భరిస్తూనే ఉంది. అదే సమయంలో ఆ దేశం, దాని ప్రజలూ ఏకత్రాటిగా నిలిచి తీవ్రంగా నష్టపోయిన ప్రాంతాలను పునర్నిర్మించుకున్నారు. సునామీ రాక ముందు, వచ్చిన తర్వాత ఆ ప్రాంతాలను చూసిన వారికి వింతగొల్పటమే కాకుండా జపనీయుల పట్ల గౌరవం ఇనుమడించక తప్పదు.

గతసంచిక సంపాదకీయం వరకు మేము నెలవారీగా ముఖ్యమైన తేదీలను వాటి ప్రాధాన్యతను వివరిస్తూ వచ్చాము. ఇటీవలి కాలంలో వాటిని పదే పదే వివరిస్తూ వచ్చాము. వాటిని సంపాదకీయం నుంచి తొలగించ దలిచాం. మీ అభిప్రాయం తప్పక పంపగలరు.

సెలవుదినాల్లో పొందే అనుభవాలను మాకు రాసి పంపవలసిందిగా మా ప్రియతమ పాఠకులను కోరుతున్నాము. వచ్చే సంచికలో వాటిని ప్రచురించగలము కూడా.

సెలవుదినాలను మీరు సంతోషంగా గడిపెదరు గాక!!! – సంపాదకులు



# పాఠకుల లేఖలు

ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్ కోసం ఈ మధ్యే జైపూర్ వెళ్లాను. తెల్లవారు జామున రైలు దిగగానే స్టేషన్ లోని బుక్‌స్టాల్‌లో పుస్తకాల బండిల్స్ దింపుతుండటం కనిపించి అటు కేసి చూస్తే జిగేలుమంటూ ఫిబ్రవరి నెల హిందీ చందమామ కనిపించింది. ఒక్క ఉదుటన అక్కడికి పరిగెత్తి చందమామ కావాలని అడిగి తీసుకున్నాను. పక్కకు కూడా తొలగకుండా అక్కడే పుస్తకాన్ని తెరిచి చూస్తుండటంతో షాపు అతను పక్కన కుర్చీ వేసి కూర్చుని చదవమన్నాడు. ఈలోపు మా స్నేహితులు వచ్చి నన్ను లాక్కెళ్లినంత పనిచేశారు. ఇక్కడా చందమామేనా. నువ్వు వచ్చిన పని ఏమిటి, చందమామ కోసం పరుగెత్తడమేమిటి అని మందలించారు. ఇక మా స్నేహితురాళ్లయితే 'చందమామ అంటే ఇంత పిచ్చేమిటే నీకు' అంటూ దెప్పుతుంటారు. బాల్యంలో, యవ్వనంలో, వృద్ధాప్యంలో కూడా 'చందమామ పిచ్చి' ఉండటం అవసరం అని నా అభిప్రాయం. చందమామను చిన్నప్పుడూ వదలలేదు. ఇప్పుడూ వదలలేదు. ముందు ముందు కూడా వదలాలని అనిపించడమూ లేదు. – డాక్టర్ సిరి, మిర్యాలగూడ, ఎపి

బాల్యం నుంచి చందమామ నీతి కథలు చదువుతూనే పెరిగాను. అయితే ఇటీవలి చందమామ సంచికలలో ప్రచురితమైన కథలు నాసిగా ఉన్నాయి, పైగా చాలా కథలు పదే పదే తిరిగి ప్రచురించబడుతున్నాయి. ఫిబ్రవరి, మార్చి నెలల్లో ప్రచురించిన రెండు కథలలో సందేశం ఒకేలా ఉండటం గమనించాను. ఒకే రకం కథలు ప్రచురించడం తగ్గించండి. అప్పుడే చందమామ నాణ్యత పెరుగుతుంది. అలాగే పాఠకుల అభిప్రాయం పట్ల మీ సానుకూల వైఖరిపై నమ్మకం కలుగుతుంది. – శ్రీనివాస్ పామర్తి (ఇమెయిల్ ద్వారా)

బేతాళ కథ 'అనంతుడి ఆంతర్యం' ఆలోచనాత్మకంగా ఉంది. చందమామతో జ్ఞాపకాలు శీర్షికలో సీనియర్ పాఠకులు తమ తీపి గుర్తులను నెమరేసుకున్న తీరు మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తోంది. పంచతంత్రం సీరియల్ ఆసక్తికరంగా కొనసాగుతోంది. బాలబాలికలలో విజ్ఞాన కాంక్షను పెంచే శీర్షికలను ప్రవేశపెట్టగలరు. – బిక్కునూరి రాజేశ్వర్, పాన్కల్, ఎపి

జటాయువుపై ముఖచిత్రం అద్భుతంగా ఉంది. అశోకచెట్టు కింద సీత బొమ్మ కూడా బాగుంది. ఆర్ట్ బుక్ లోంచి తీసి, వేసిన చిత్రం కళ్లు చెదిరేంత చక్కగా ఉంది. ఒకే సంచికలో నాలుగు పూర్తి పేజీ చిత్రాలు రావడం చందమామలో అరుదు. – నిమ్మల రమేష్, చిత్తూరు, ఎపి

ఈ సంచికలోని అయిదు చిన్న కథలూ చాలా బాగున్నాయి. 'ఎంత డబ్బుంది అనడిగితే అంతులేనంత' అని చెప్పి లక్ష్మీదేవి మాయమవటం చూసి కడుపుబ్బా నవ్వొచ్చింది. 'ప్రేరణ' కథలో కూడా చివర్లో సందేశం చాలా బాగుంది. ఎద్దుకు కూడా బాధ ఉంటుందని చెప్పిన చిన్నకథ అమోఘం. నిజంగా చందమామ చిన్నకథలు నిమ్మతొనలే. – జోగారావు, విజయవాడ

చందమామలో 'విత్తనం గింజ' కథ చాలాబావుంది. 'ఆకలి తప్ప మాకేమీ తెలియదు. రేపటి సంగతి ఏమో కాని ఇప్పుడు మాత్రం పూట గడవడం లేదు.' అనే మాటలు ఎంత వాస్తవికం. ఎంత హృదయవిదారకం. రచయితకు అభినందనలు. – సిహెచ్. వేణు, హైదరాబాద్

చందమామ కథలలోని హేతువు, తర్కం పాఠకులను అలరిస్తుంది. మార్చి నెల సంచికలో 'వడ్డించేగరిటె', 'నాలుగో దొంగ', 'చెట్టునీడ' కథలు చక్కటి తర్కంతో, వినోదంతో ముగిశాయి. ఇకపోతే 'వంటలరాణి', 'విత్తనం గింజ' కథలు చందమామకే హైలెట్. రాయలవారికే వంట రుచి చూపిన 'ముసలమ్మ కథ' చాలా బాగుంది. పిల్లలు చదువుకోవాలని బోధించిన విత్తనం గింజ చాలా చాలా మంచి కథ. – నరసింహులు, కర్నూలు

మార్చి నెలలో కథలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా 'అందరికీ ఒకటే న్యాయం,' 'వంటల రాణి' కథల ద్వారా మీరు అందించిన సందేశం చాలా గొప్పది. భారత సంస్కృతి మరియు సంప్రదాయ విలువలను కథల ద్వారా తెలియచేసి ఉత్తమ సేవలందిస్తున్న చందమామకు మా అభినందనలు. అలాగే అట్ట వెనుక వేసిన వపాగారి చిత్రాలు కూడా బాగున్నాయి. వపా చిత్రాలు వేసినవి మరోసారి వేయకుండా ఉంటే బాగుంటుంది. ఎప్పుడూ ఒకలాంటివే కాకుండా భిన్నమయిన చిత్రాలు వేస్తే బాగుంటుంది. సుభద్రార్జునులు, రతీ మన్మధులు, గంగాశంతనులు, విశ్వామిత్ర మేనక, తారాచంద్రులు, గజేంద్రమోక్షం, భగీరథ ప్రయత్నం, చందమామ యువరాణులు, సౌందర్యరాశులు, ముద్దుగుమ్మలు, ముగ్ధమనోహరమైనటు వంటి వపా చిత్రాలు వేసి పాఠకుల హృదయాలను రంజింపచేస్తారని ఆశిస్తూ....!

– మాధవ్, పాతపట్నం, శ్రీకాకుళం జిల్లా, ఏపి

చందమామ ఫిబ్రవరి సంచిక సంపాదకీయం డార్విన్ గురించి హేతువిరుద్ధ ప్రకటన చేసింది. అతడి సిద్ధాంతంలోని లోపాలు జగద్విదితమే కాని సైన్స్ అభిమానులుగా చెప్పుకుంటున్న వారు ఈ సిద్ధాంతంతో ఇప్పటికీ మోసగించబడుతున్నారు. చందమామ వంటి పత్రిక ఇలాంటి పిడివాద అభిప్రాయాలను ప్రస్తుతించకూడదు. ఈ విషయంకి సంబంధించి కొన్ని అంశాలను పంపిస్తున్నాను చూడండి. – కృష్ణ ప్రసన్న (ఇమెయిల్ ద్వారా)

5 ఏళ్ళ ప్రాయం నుంచి చందమామ చదువుతున్నాను. కొత్త చందమామ కోసం ఎప్పటికీ వేచి చూస్తుంటాను. విదేశీ కథలు, ఫోటో వ్యాఖ్య పోటీ, భయంలేని నలుగురు వంటి రచనలను ఒరియా చందమామలో ప్రచురించగలరు. – గోరాచంద్ (ఇమెయిల్ ద్వారా)

చందమామకు శుభాకాంక్షలు. ఒరియా చందమామను ఒరియా రాష్ట్రానికి వెలుపల ప్రచు రించడం ముదావహం. సహకార శాఖలో అధికారిగా పనిచేస్తున్న నేను ఒరియా రచయితగా ఈ ఉత్తరం పంపుతున్నాను. అనేక సంవత్సరాలుగా నేను రాస్తున్నాను. ఇప్పుడు నాకు 85 సంవత్సరాలు. ఇప్పటికీ నేను రాస్తూనే ఉన్నాను. చందమామ ప్రచురించిన సంచికలతో నా ఇల్లు కళకళలాడుతుంటూంది. – హరేకృష్ణ దాస్, బరగాడ

కన్నడ ప్రజలు తమ భాషను ప్రేమిస్తున్నట్లే, పిల్లలు, పెద్దలు చందమామ సంచికను ఇష్టప డుతున్నారు. మరిన్ని జోక్స్, హాస్యకథలను ప్రచురించండి. జటాయువు ముఖచిత్రం చాలా బాగుంది. మార్చి సంచికలోని కథలు చక్కగా ఉన్నాయి. గత 25 సంవత్సరాలుగా చంద మామను చదువుతూనే ఉన్నాను. సొగసైన కథల ద్వారా చందమామ అన్ని వయస్సులవారినీ ఆకర్షిస్తోంది. – ఆర్. విజయకళ/ఎంపి స్వామి, బెంగళూరు

Avail the loyalty bonus!

Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)



Chandamama!

Because stories make the world go round...

Choose your Chandamama!

Go to www.chandamamashop.com & subscribe Now!!



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ____________________

Date of Birth: ____________ Sex: ________

Address: ____________________

____________________

____________________

____________ City: ____________

State: ____________ Pin: ____________

Telephone: ____________________

Mobile: ____________________

Email: ____________________

Subscription Number (for renewals): ____________

Gift Subscription to the following address:

____________________

____________________

____________________

____________________

Enclosed Cheque/DD* for Rupees ____________

Cheque/DD No. ____________

favouring Chandamama India Ltd on ____________

____________________ Bank

* Your subscription will commence in 6 weeks.

Please mail the subscription form to:

**Chandamama India Limited,**
P.O.Box No.19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com

You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| English [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| Regional [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| JUNIOR [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

నాకు బాగా జ్ఞాపకం. అప్పట్లో మా కుటుంబం మదరాసులో ఉండేది. మాకు తెలిసిన ఒకావిడ ఇంటికి వెళ్లి మా అమ్మ చందమామ చదివేది. ఆమె వెంట నేను కూడా వెళ్లేవాణ్ణి కనుక నాకు కూడా చందమామ చదవటం అబ్బింది.

మాకు తెలిసిన ఒకావిడ పేరు జానకమ్మ. వాళ్లింటికి మా ఇంటికి దూరం అర్ధ కి.మీ. ఆ రోజుల్లో నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు చందమామ మొదటి తారీఖునే మా చేతుల్లో ఉండేది. నేను వాళ్లింటికి చందమామ కోసం వెళ్లినప్పుడు ఆవిడ సీరియల్ చదువుతుండేది. అది చదవగానే నాకిస్తే నేను ఇంటికి తీసుకెళ్లి ఒక్క గంటలో చదివి మళ్లీ వాళ్లింటికి వెళ్లి ఇచ్చి వచ్చేవాడిని. ఒక్కొక్కసారి వాళ్లింటికి వెళ్లినప్పుడు ఆమె కూతురు చదువుతుండేది. నన్ను చూసి 'ఇప్పుడే ఇస్తా కూర్చో'మనేది. ఎప్పుడిస్తుందా, తీసుకెళ్లి ఎప్పుడు చదువుతామా అని మనసులో ఉత్కంఠ ఆపుకోలేక కూర్చోకుండా అక్కడే తచ్చాడేవాడిని. నాకప్పుడు ఎనిమిదేళ్లు. అంత ఆసక్తిగా చందమామను చదివే నేను, చందమామ వల్లే తెలుగు రాయడం చదవడం క్షుణ్ణంగా నేర్చుకున్నానంటే అతిశయోక్తి కాదు.



Name: M. Balaji Singh
Occupation:Rtd.Employee
Place: Hyderabad.

మాది పేద కుటుంబం. అందువల్ల ఆరణాలు పెట్టి చందమామను కొనే తాహతు అప్పట్లో లేదు. అందుకే నేను వాళ్లింటికి పోయి చందమామ చదివేవాడిని. చందమామతో నా అనుబంధం ఇప్పటికీ కొనసాగుతోంది. అప్పటి ఆణిముత్యాల్లాంటి కథలే ఇప్పటి నా పాత జ్ఞాపకాలు. 'తోకచుక్క', 'పాపిష్టిముఖాలు', 'కొయ్యగుర్రం', 'చందమామ మందహాసం' వంటివే కాకుండా చిన్న కథలు కూడా ఎంతో విజ్ఞానంగా మనసును ఆకట్టుకునేలా ఉండేవి. అప్పటి ఫోటో వ్యాఖ్యల పోటీలో వ్యాఖ్యలు చదివిన తర్వాత ఆ పదాల కలయికలో ఉండే అనుబంధం మనసులో హత్తుకుని మరపురాకుండా ఉండేది.

నేను 1963లో ఉద్యోగం చేరిన తర్వాత కొన్న చందమామలు చాలా వరకు పదిలంగా దాచుకున్నాను. చందమామతో నా అనుబంధం పెంచుకోవాలని ఒకటి రెండు కథలు 1966-70 మధ్య చందమామకు పంపించాను కాని అవి ప్రమాణం లేని కారణంగా కాబోలు ప్రచురించబడలేదు. నా తపన తీరలేదు. ఇంతలో ఉద్యోగంలో ప్రమోషన్లు రావటంతో పని భారం అధికమై సమయం అనుకూలించలేదు.

నా పదవీ విరమణ (2002లో) తర్వాత ఫోటో వ్యాఖ్యల పోటీకి వ్యాఖ్యలు పంపించాను. ఒకటి సెప్టెంబర్ 2006 చందమామలో ప్రచురించబడింది. రెండవది అక్టోబర్

2009 చందమామ సంచికలో ప్రచురించారు.

ఇప్పుడు నాకు 67 సంవత్సరాలు. సమయం దొరికినప్పుడు పాత చందమామలు సర్దటం, చదవటం సరదా. చందమామలోని పాత కథలు జ్ఞాన భాండాగారం. బాలలకు విజ్ఞాన దీపిక. నాలాంటి వయసు మళ్లిన వారికి జ్ఞాపకాల పందిరి.

## చందమామతో నా జ్ఞాపకాలు - గుజరాతీ

నా పేరు అబ్దుల్ హమీద్. మాది గుజరాత్, బనస్కాంత జిల్లాలోని పలన్‌పూర్. నా వయస్సు 38 సంవత్సరాలు. పదకొండేళ్ల వయసులో మా నాన్న చందమామ పత్రికను చదువుకోమని ఇచ్చారు. మొదటిసారిగా దాన్ని నేను చదివినప్పుడు సంబరపడ్డాను. ఒక్కమాటలో చెప్పాలంటే మాటల్లో చెప్పలేని అనుభూతి.

అరేబియన్ నైట్స్, చందమామ కథలు అంటే నాకు చాలా ఇష్టం. ప్రత్యేకించి చంద మామలో కథకు మల్లే చిత్రాలు కూడా వర్ణరంజితంగా ఉంటాయి. చిన్న చిన్న పల్లెటూర్లు, పొలాలు, పచ్చదనం ఎంత సుందరభరితంగా ఉండేవంటే ఆ కథల్లోని పాత్రలు మావే అని అనుభూతి చెందేవాళ్ళం. చందమామలోని అద్భుతమైన సుందర చిత్రాలు ప్రపంచంలో ఏ పత్రికలోనూ ఉండవేమో!


Name: Abdul Hamid Memon, Palanpur, Banskantha, Gujarat.

ప్రశాంతమైన, అందమైన గ్రామాలకు చెందిన రంగు రంగుల చిత్రాలు, పాతకాలపు బళ్లు, మర్రి చెట్టు, తటాకాలు, జలపాతాలు, కొండలు, జంతువులు, పక్షులు, నెమలి, కాకి వంటి చిత్రాలు ప్రపంచంలో ఏ పత్రిక కన్నా మిన్నగానే చంద మామలో దర్శనమిస్తాయి. అల్లా దయ, మా అదృష్టం కొద్దీ మేము చందమామను చదువుతున్నాము, చూస్తున్నాము. ఈ పత్రిక మా మనస్సును, బుద్ధిని తాజాగా ఉంచ డమే కాకుండా చాలా ఉపశమనం కలిగిస్తుంది.

చందమామలో పనిచేస్తున్న సిబ్బందికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇలాంటి సంచికలను మీరు ఎల్లప్పుడూ మాకు అందిస్తూనే ఉంటారని, ఉండాలని నేను ప్రార్థి స్తుంటాను.

చందమామలో 40-50 ఏళ్ల క్రితం ప్రచురించిన 'ఆలీబాబా నలభై దొంగలు' తదితర కథలను మీరు ప్రచురించాలని నా కోరిక.

ఇప్పుడు చందమామ మళ్లీ పునర్వైభవాన్ని సంతరించుకుంటూ పాత చందమామను తలపిస్తోంది. ఇది నిజంగా అభినందించదగ్గ విషయం.

# ప్రజాసేవకుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటి లాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, 'విక్రమార్క మహారాజా, కార్యసాధనలో నీ పట్టుదల అనితరసాధ్యమనడంలో ఎటువంటి సందేహం లేదు. కాని పరిపాలనా దక్షతలో నీ పాటవాన్ని సందేహించవలసి వస్తోంది. ఎందుకంటే రత్నభూషణుడనే రాజు నేరస్తుడిని కాకుండా అతడిని పట్టి ఇచ్చినవాడినే కఠినంగా శిక్షించి చాలా వింతగా ప్రవర్తించాడు. నీకు శ్రమ తెలియకుండా ఆ కథ విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.

రత్నభూషణుడనే రాజు పరిపాలించే అవంతీరాజ్యంలో మొగలివనం ఒక మారుమూలగ్రామం. ఆ ఊరిలోకి దుర్గయ్య అనే ఓ కొత్త వ్యక్తి ప్రవేశించాడు. ఆ వ్యక్తి వళ్లంతా దుమ్ముపట్టి ఎర్రగా మారిపోయి ఉన్నాడు. చాలా దూరం నుంచి నడిచి వచ్చినందువల్ల



బాగా అలసినట్లున్నాడు. ఆకలి దహించి వేస్తున్నా ఏ ఇంటి ముందుకైనా వెళ్లి దేహీ అన లేదు. పనికోసం వెదుకుతుంటే ఓ కిరాణా కొట్టు ముందు సరుకులతో బండి నిలబడి ఉంది. అతడు సరుకులన్నీ కొట్టులోకి మోసి, 'అయ్యా, పట్టెడన్నం పెట్టించండి చాలు,' అన్నాడు కొట్టు యజమాని లింగమయ్యతో. లింగమయ్య అతడికి కుండలో మిగిలిపో యిన అన్నం పెట్టి, కానీ ఖర్చులేకుండా పని జరిగినందుకు చాలా సంతోషించాడు. దుర్గయ్య ఆ క్షణం నుంచీ ఆ ఊరిలోనే స్థిరపడాలనుకున్నాడు. ఆ ఊరిలో ఎవరైనా తమ పనులు చేసుకోలేక అవస్థలు పడు తుంటే ఎటువంటి ప్రతిపలం ఆశించకుండా వారికి సహాయ పడేవాడు. పిలిచి అన్నం పెడితే కడుపు నింపుకునేవాడు. కాసు, అర కాసు ఇస్తే దాచుకునేవాడు. రాత్రిళ్లు ఏ ఇంటి అరుగుమీదనో పడుకొని నిద్దురపో యేవాడు. క్రమేణా ఆ ఊరిలో ఎవరికి ఏ పనిబడినా దుర్గయ్యను పిలిచేవాళ్లు. దుర్గయ్య ఎంత కష్టమైన పని అయినా అవలీలగా చేసే వాడు. అతడు పనిచేసేది ప్రతిఫలం కోసం కాదు. అతడికి సేవే పరమార్థం. చాలా రోజులు గడిచిన పిమ్మట దుర్గయ్య వద్ద కొంత డబ్బు పోగయింది. ఆ డబ్బుతో గ్రామ ప్రజలకు మేలు జరిగే పని చేయాలనుకున్నాడు.

ఆ ఊరిలో లింగమయ్య పరమస్వార్థప రుడు. ఆ ఊరికి అతడిదొక్కటే కిరాణా కొట్టు. అందువల్ల మోసపు తూకాలతో, రెట్టింపు లాభాలతోనూ, ప్రజల్ని దోచుకునేవాడు. సమ యానికి డబ్బులేక పోతే అప్పిచ్చేవాడు కాదు. ప్రజలు దూరాభారం వెళ్లలేని పరిస్థితివల్ల ఆ ఊరిలో అతడిదే ఇష్టారాజ్యం.

దుర్గయ్య లింగమయ్య ఆగడాల్ని చూసి సహించలేకపోయాడు. అతడి దోపిడీని అరి కట్టాలనుకున్నాడు. దుర్గయ్య పట్నం వెళ్లి తన వద్ద ఉన్న డబ్బుతో ఓ తోపుడు బండి, కొద్ది పాటి సరుకులు కొని తిరిగి గ్రామానికి వచ్చి ఇంటింటికీ తిరిగి వారికి కావలసిన సరు కులు నామమాత్రపు లాభాలతో అమ్మాడు. ఇది చాలా లాభసాటిగా అనిపించడంతో దుర్గయ్యను ఆ వ్యాపారం కొనసాగించవల సిందిగా ప్రజలు ప్రోత్సహించారు. దుర్గయ్య సమయానికి డబ్బు లేని వారికి అప్పిచ్చేవాడు. కష్టాల్లో ఉన్న వారికి ఉచితంగా ఇచ్చేవాడు. దీంతో లింగమయ్య కొట్టుకు వెళ్ళేవారి సంఖ్య క్రమంగా తగ్గిపోయింది. లాభం

స్వల్పమయినా అధిక వ్యాపారం జరగడంతో దుర్గయ్య ఇల్లు కట్టుకోగలిగాడు. ఇంటిలోనే కిరాణా కొట్టు పెట్టేసి ప్రజలకు మరింత ఉప యోగపడసాగాడు. దుర్గయ్య, ప్రజలకు మునుపటిలాగే సేవ చేయడం మానేవాడు కాదు. పరోపకారమే తప్ప ఏనాడూ స్వార్థ పరుడిగా ప్రవర్తించేవాడు కాదు.

లింగమయ్య సరుకులు కొనేవాళ్లు లేక పుచ్చిపోవడం లేదా చెడిపోవడం ప్రారంభమ య్యాయి. దుర్గయ్యపై అతడి అసూయ, ద్వేషం తారాస్థాయికి చేరాయి. దుర్గయ్యను ఎలాగైనా తుదముట్టించాలని పథకం రచిం చాడు. అదను చూసుకుని ఒకనాటి అర్ధ రాత్రి దుర్గయ్య గాఢనిద్రలో ఉండగా బయ టికి రాకుండా గొళ్లెం పెట్టి, కొంపకు నిప్పు పెట్టాడు.

మంటలు ఎగిసిపడటంతో ప్రజలు మేల్కొని రక్షించినా అప్పటికే దుర్గయ్య తీవ్ర గాయాలతో స్పృహ కోల్పోయి ప్రాణాపా యంలో పడ్డాడు. ప్రజలు అప్పటికప్పుడు బండి కట్టించి పట్నం తీసుకెళ్ళి దుర్గయ్యను వైద్యశాలలో చేర్పించారు. ప్రజలందరూ అతడికోసం ఏడుస్తూ తమ ఆత్మీయుడి లాగా సేవ చేయసాగారు.

వైద్యం వల్లనూ, ప్రజల ప్రార్థనలు, సేవల వల్లనూ, దుర్గయ్య ప్రాణగండం నుంచి తప్పించుకుని క్రమంగా కోలుకోసాగాడు.

దుర్గయ్య కోసం, అంతమంది ప్రాకులా డటం పక్క పడక మీద ఉన్న ఓ రోగికి ఆశ్చర్యం కలిగించింది. 'అయ్యా ఇతడే మన్నా మీ చుట్టమా?' అడిగాడు ఆ రోగి.

'కాదు. కానీ ఇతడు మా పాలిట దేవుడు. ఇంత గొప్ప వ్యక్తిత్వం గలవారిని మేమింత వరకూ చూడలేదు,' అన్నారు గ్రామస్తులు.





గుండెల్లో పిడుగులు ప్రేలేవి. దొంగతనం చేయడమంటే అతడికి సరదాగా ఆడుకునే ఆట లాంటిది.

అందుకే రాజు మల్లన్నను పట్టి ఇచ్చినా, లేదా ఆచూకీ తెలిపినా పదివేల రూపాయల బహుమతి ఇవ్వబడుతుందని ప్రకటించాడు.

ఒకరోజు మల్లన్న ఓ అనువైన ఇంట్లో దొంగతనం చేస్తుండగా వంట సామగ్రి కింద పడి అలికిడయింది. ఆ అలికిడికి ఆ ఇంటి యజమాని మేల్కొని దీపం వెలిగించాడు. మల్లన్న పారిపోయే ప్రయత్నంలో కాళ్లకు దీపపు చెమ్మ అడ్డుపడి అది కింద పడిపోయి మంటలు వ్యాపించి ఇల్లు అంటుకుంది. ఆ ఇంటి యజమాని అతడి భార్య నలుగురు పిల్లల్ని రక్షించారు. ఒక్క ఆడపిల్ల మాత్రం ఇంట్లోనే ఉండిపోయింది. అప్పటికే మంటలు ఇల్లంతా చుట్టుకుని పెద్ద ఎత్తున ఎగిసి పడుతున్నాయి.

'అయ్యో, పసిపాప అగ్నికి ఆహుతి అయిపోతోంది,' అంటూ ఆర్తనాదాలు చేస్తున్నారు గాని, ఇంట్లోకి ప్రవేశించడానికి ఎవరూ సాహసించడం లేదు. అప్పటికే గ్రామం దాటిన మల్లన్నకు ఆ కేకలు వినిపించాయి. తన కారణంగా అభం శుభం తెలియని ఓ పసిపిల్ల ప్రాణాలు కోల్పోకూడదనుకుని తిరిగి వచ్చాడు.

మల్లన్న మంటల్ని లెక్క చేయకుండా ప్రాణాల్ని ఫణంగా పెట్టి పసిబిడ్డను బయటకి తీసుకొచ్చాడు. అప్పటికే పసిబిడ్డ తీవ్ర గాయాలతో ప్రాణగండంలో ఉంది. మల్లన్న ఆ పాపను వైద్యుడి వద్దకు తీసుకెళ్తుండగా

'అయ్యా, అదంతా నాకు తెలియదు. కానీ, ఇతడిని పట్టి ఇచ్చినా, ఆచూకి తెలిపినా పదివేల రూపాయల బహుమతి లభించగలదు. ఇతడో పెద్ద గజదొంగ. ఇతడి పేరు దుర్గయ్య కాదు. మల్లన్న. నేను చెప్పవలసింది నేను చెప్పాను ఆ పైన మీ ఇష్టం,' అన్నాడు ఆ రోగి.

నేరం తన మీదకు రాకుండా మిగిలిన గ్రామస్తులతో పాటు ఆసుపత్రికి వచ్చి ప్రేమ నటిస్తున్న లింగమయ్య ఆ మాటలు విన్నాడు. వెనువెంటనే రక్షక భటులకు దుర్గయ్య సమాచారం అందించాడు. రక్షక భటులు దుర్గయ్యను గొలుసులతో బంధించి రాజు వద్ద హాజరుపరిచారు.

దుర్గయ్య అసలు పేరు మల్లన్న. అతడో గజదొంగ. అతడి పేరు వింటే దేశ ప్రజల

ప్రజలు పోనీకుండా అడ్డుపడి, అతడిని చుట్టుముట్టేశారు.

'అయ్యా, ఈ పసిపాపను ముందుగా వైద్యుడి వద్దకు తీసుకెళ్లనివ్వండి. ఆ తరువాత నాకు, మీకు తోచిన శిక్ష విధించండి,' అంటూ వేడుకున్నాడు.

ప్రజల్లో పాప పరిస్థితి గురించి పట్టించుకునే వాడొక్కడూ లేడు. అందరూ కలిసి మల్లన్నను ఇష్టమొచ్చినట్లు కొట్టసాగారు. మల్లన్న ఎలాగో ప్రజల బారి నుంచి తప్పించుకుని పారిపోయాడు. వైద్యం సకాలంలో అందక పాప కన్నుమూసింది.

పసిపాప మరణం మల్లన్నలో పరివర్తన తీసుకుని వచ్చింది. ఇకమీదట తన వృత్తిని వదిలేసి ఎటువంటి స్వార్థం లేకుండా ప్రజలకు సేవ చేస్తూ జీవించాలని నిర్ణయించుకున్నాడు. అంతవరకూ తను దొంగిలించి కూడబెట్టిన సొమ్ము పేదలకు దానం చేసి తన గురించి ఏమాత్రం తెలియని మారుమూల గ్రామాలుండే మొగలి వనం చేరుకున్నాడు.

మల్లన్న దొరికాడనగానే అతడి వలన నష్టపోయిన వారంతా రాజుగారి సభకు హాజరయ్యారు. వీరందరూ మూకుమ్మడిగా మల్లన్నను ఉరితీయవలసిందిగా నినాదాలు చేసారు. అదే సమయంలో మొగలివనం ప్రజలు స్త్రీలు, పురుషులు, పిల్లలతో సహా అక్కడే ఉన్నారు. వారందరూ మల్లన్న దేవుడిలాంటివాడని, ఏ చిన్న శిక్షా విధించవలదని, అతడి కోసం తామంతా ప్రాణాలు అర్పించగలమని నినాదాలు చేశారు. పైగా లింగమయ్యను కఠినంగా శిక్షించవలసిందని కోరారు.



ప్రజల్లోని ఈ విభిన్న ధోరణులు చూసి రత్నభూషణుడు విస్తుపోయాడు.

రత్నభూషణుడు మల్లన్న నేరమయ జీవితం నుంచి పరివర్తన చెందిన వైనం పూర్వాపరాలు విచారించాడు.

అనంతరం మల్లన్నను పట్టి ఇచ్చిన లింగమయ్యకు బహుమతి ఇవ్వకపోగా నాలుగు సంవత్సరాల కఠిన కారాగారవాసం విధించాడు.

మల్లన్నను వాణిజ్యాధికారిగా నియమిస్తున్నట్లు ప్రకటించాడు. ఆ పదవి ద్వారా వ్యాపారస్థుల ధరలను నియంత్రించవచ్చు.

అప్పుడు మల్లన్న రాజు రత్నభూషణుడితో 'మహారాజా, నేను మొదట నేరస్తుడిని, కావున నా నేరానికి తగిన శిక్ష విధించండి. ఆ శిక్ష అనుభవించిన తరువాత ప్రభుత్వాధి

కారిగా పదవి స్వీకరించడానికి నాకెటువంటి అభ్యంతరం లేదు.' అన్నాడు.

మల్లయ్య అభ్యర్థనకు రత్నభూషణుడు ఎంతో సంతోషించి అతడికి ఆరునెలలు కఠిన కారాగారవాస శిక్ష విధించాడు. శిక్ష అనుభవించిన పిమ్మట మల్లన్న ప్రభుత్వాధికారిగా నియమితుడయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, 'రాజా రత్నభూషణుడు తన ప్రకటనకు తనే కట్టుబడక పోవడం వల్ల భవిష్యత్తులో అతడి ప్రకటనలకు విలువ ఉండదు. అంతేకాదు. నేరస్థులను పట్టి ఇవ్వడానికి ఎవరూ ముందుకు వచ్చే అవకాశం ఉండదు. రత్నభూషణుడికి ఆ మాత్రం పరిజ్ఞానం లేదా? ఇకపోతే మల్లన్న ప్రవర్తన మరీ వింతగా ఉంది. ఎందుకంటే రాజుగారు పదవి ఇవ్వజూపితే, ఎవరైనా సరే వెనుకా ముందూ ఆలోచించకుండా స్వీకరిస్తారు. కానీ మల్లన్న శిక్షను కోరడం పిచ్చివాడి చేష్ట కాదా? ఇందులో మర్మమేమైనా ఉందా? దీనికి సమాధానం తెలిసీ చెప్పక పోయావో నీ తల వేయి ముక్కలవుతుంది,' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, 'మొగలి వనం గ్రామస్తులందరితో పాటు లింగమయ్యకు కూడా మల్లన్న చాలా ఉత్తముడని తెలుసు. తెలిసీ అతడిపై హత్యాప్రయత్నం చేయడం. ఆచూకి తెలుపడం అతని స్వార్థానికి పరాకాష్ట. మల్లన్నను పట్టి ఇవ్వడం ద్వారా దేశానికి మేలు చేయాలన్ని ఉద్దేశం అతడి కెంత మాత్రం లేదు. కాబట్టి అతడు శిక్షార్హుడే.

ఇకపోతే నేరస్థుడయిన అధికారి తన అధికార పరిధిలోని నేరస్తులను శిక్షించాలంటే అతడిపై పడిన మచ్చ అడ్డు వస్తుంది. అటువంటి అధికారి ప్రజల విమర్శలకు గురికాక తప్పదు. తన నేరానికి తగిన శిక్ష అనుభవించడం ద్వారా అతడు ప్రజలందరికీ ఆదర్శప్రాయుడౌతాడు. అందుకే ప్రభుత్వాధికారి కాబోతున్న మల్లన్న ముందుగా శిక్షను కోరుకున్నాడు.' అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలుగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. – కల్పితం

*(ఆధారం: గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు)*





# కపటదానం

పూర్వం చంద్రనగరంలో ఒక కరణం ఉండే వాడు. ఆయనకు అంతులేని పొలం, కట్టుకుపోయినన్ని పశువులూ ఉండేవి. అయినా పరమలోభి. కానీ సంపాదనలోంచి ఖర్చు చేయాలంటే గిజగిజా తన్నుకునే వాడు.

ఒకరోజు కరణం ఆవులలో ఒకదానికి జబ్బు చేసి తీవ్రంగా పరిణమించింది. దాని పొట్ట ఉబ్బిపోయి శ్వాస కూడా సరిగా పీల్చలేకుండా ఉంది. కరణం గారికి ఆవు పోతున్నదన్న విచారంతో పాటు, దాన్ని ఊరి బయటికి లాగించటానికి రెండు రూపా యల ఖర్చు అవుతుందే అన్న విచారం కూడా పట్టుకుంది.

కరణం గారు ఈ విషయం భార్యతో అన్నాడు. ఆవిడకూడా లోభంలో భర్తకు తీసిపోయేదేమీ కాదు. 'చచ్చిపోయే ఆవును ఎట్లాగు ఆపలేం. పై ఖర్చు తగలకుండా చూడండి.' అన్నదావిడ భర్తతో.

'అదే నేనూ ఆలోచిస్తున్నాను,' అన్నాడు కరణం తలూపుతూ.

కరణంగారు వీధి అరుగుపై కూచుని ఉండగా, అటుకేసి ఒక యాయవారం బ్రాహ్మడు వచ్చాడు. ఆ బ్రాహ్మడు ఆ ఊరికి కొత్త. ఆయనను చూడగానే కరణం గారికి మంచి ఆలోచన తట్టింది.

'ఏమయ్యా బ్రాహ్మడా? సమయానికి కనిపించావు. నీకోసమే కబురు చేద్దామను కుంటున్నాను,' అన్నాడు కరణం.

'చిత్తం! ఏమిటి విశేషం?' అన్నాడు యాయవార బ్రాహ్మణుడు.

'వెనక నాకు పెద్ద జబ్బుచేస్తే గోదానం

పి.వి. భావనాచార్యులు

చెయ్యమన్నారు. అది ఈనాటికీ పడింది కాదు. ఇవాళ నువు కనిపించావు. నువ్వ యినా పిల్లాపీచు కలవాడివి. గోవును దానం చేస్తాను. హాయిగా ఇంటికి పట్టు కుపో!' అన్నాడు కరణం.

బ్రాహ్మడికి పరమానందమయింది. ఆయనది పిల్లాపీచూ గల సంసారం. పాలకు ఆయన చాలా ఇబ్బంది పడిపోతు న్నాడు. ఈ కరణంగారు పరమలోభి అని విని ఈయనను ఎన్నడూ, ఏమీ యాచిం చలేదు. కాని తీరా చూస్తే ఈయన మంచి దానపరుడిలాగే కనిపించాడు.

'మీరిస్తానంటే నేను కాదంటానా? కాని ఇవాళ అష్టమి, బాగాలేదు. ఎల్లుండి దశమి నాడు దానం పడతాను,' అన్నాడు బ్రాహ్మడు వినయంగా.

'అలాకాదు. ఇవాళే, ఇప్పుడే పుచ్చుకో వాలి. నాకు పనులు నానబెట్టడం బొత్తిగా పనికిరాదు. గోదానానికి కూడా తిథి వార నక్షత్రాలేమిటి?' అన్నాడు కరణం.

కాదు కూడదంటే, కరణం ఆవును కాస్తా మరొకరి చేతిలో పెట్టేసిపోతాడని యాయవారు బ్రాహ్మడు మంచిరోజు కాక పోయినా గోదానం పుచ్చుకోవటానికి సిద్ధ మయ్యాడు.

ఇద్దరూ బయలుదేరి కరణంగారి పశు వులశాలకు వెళ్లారు. చావుబతుకుల మధ్య ఉన్న ఆవును చూపించి కరణంగారు 'అదుగో మీ ఆవు. తీసుకుపో,' అన్నాడు.

బ్రాహ్మడికి కరణం దుర్బుద్ధి అర్థమ యింది. ఆ ఆవుమీద పూర్తిగా ఆశ వదులు కున్నాకనే కరణం గారు దానం ఇవ్వడానికి



నిశ్చయించాడు. లేకపోతే కానీకి గడ్డితినే కరణం గారేమిటి? పోయి పోయి గోదానం చెయ్యటమేమిటి? గోదానం వెంటనే పుచ్చు కోమని తొందరపెట్టడం కూడా ఇందుకే నన్నమాట.

'దానికి ఒంట్లో బాగున్నట్లు లేదే?' అన్నాడు బ్రాహ్మడు. 'అది ఆరోగ్యంగా ఉందని నేనన్నానా? నేను దానమిద్దామ నుకున్నది ఇదే. జబ్బుగా ఉన్నా, చచ్చినా అది నీదే, నీకు దానం ఇచ్చేశాను. నాకిక దీని పూచీ ఏమీ లేదు,' అన్నాడు కరణం గారు.

'మీ చిత్తం, నాభాగ్యం ఎవరి అదృష్టా నికి ఎవరు కర్తలు? నా ఆవును నేను పట్టు కుపోతాను. ఒక్క క్షణం ఆగండి,' అంటూ యాయవార బ్రాహ్మడు దొడ్లోకి వెళ్ళి ఏదో ఆకుకోసం వెతకసాగాడు.

ఈ బ్రాహ్మడి తండ్రి గొప్ప పశు వైద్యుడు. ఇతనికి కూడా కొన్ని మెలికలు తెలుసు. అతను కొద్ది సేపట్లోనే ఒకమొక్కను పట్టి, దాని ఆకులు కోసి తెచ్చి, వాటి రసం ఆవు ముక్కుల్లో పిండాడు. వెంటనే ఆవు పెద్దగా తుమ్మింది. దాని గొంతులో నుంచి కఫం తాటికాయ ప్రమాణంలో తెగిపడింది.

ఆవు లేచి నిలుచున్నది. కరణం గారిపై ప్రాణం పైనే పోయినంత పనయింది. 'ఒక రూపాయి డబ్బులు ఖర్చయినా ఆ మాత్రం వైద్యం చేయించుకుంటే తన ఆవు తనకే ఉండేది కదా,' అని విచారించాడు.

బ్రాహ్మడు సంతోషంతో ఆవు మెడనున్న పలుపు చేతబట్టుకుని, కరణం గారి దగ్గర సెలవు పుచ్చుకుని, దానిని ఇంటికి తోలు కుపోయాడు.

'అయ్యో, నిక్షేపమంటి ఆవును నిష్కార ణంగా యాయవార బ్రాహ్మడి పాలు చేశామే!' అన్నాడు కరణంగారు తన భార్యతో. ఇద్దరూ కలిసి చాలాసేపు కంటికి మంటికీ ఏకధారగా ఏడిచారు.





# దయ్యం వదిలింది

వాగులపల్లిలో కాపురముంటున్న రైతు రాములుకు తిమ్మాపురంలో నివసించే రైతు సింహాద్రి తోడల్లుడవుతాడు.

ఇద్దరూ సన్నకారు రైతులే అయినా సింహాద్రి అనుభవజ్ఞులను సంప్రదిస్తూ చక్కగా తన పొలాన్ని కాపాడుకుంటూ వ్యవసాయం చేసేవాడు.

వ్యవసాయానికి సంబంధించిన ఏ కొత్త విషయం తెలిసినా సింహాద్రి తన పొలంలో అమలు జరిపి ఎక్కువ దిగుబడిని పొందడమే గాక తనకు లాభాన్ని తెచ్చిపెట్టిన అంశాలను తోటి రైతులతో చర్చిస్తూ వాళ్లు కూడా వ్యవసాయంలో ఎదగడానికి సహాయం చేస్తూండేవాడు. దీంతో రైతుగానే కాకుండా సమాజంలోనూ అతని స్థాయి పెరుగుతూ వచ్చింది.

రాములు స్వభావం దీనికి పూర్తిగా వ్యతిరేకం. తనకు దిగుబడి బాగా వచ్చినప్పుడు అది ఏ కారణంగా వచ్చిందో ఎవరికీ చెప్పేవాడు కాడు. అలాగని ఏదయినా తెగులు సోకి పంట పాడయిపోతున్నప్పుడు కూడా ఇతర రైతులను హెచ్చరించేవాడు కాదు. దాంతో అందరి పైర్లకు బాగా నష్టం కలిగేది.

రాములు ఎంత కష్టపడినా సింహాద్రి స్థాయి ఎప్పుడూ అంతకు మించే ఉండేది. అందువలన రాములుకి సింహాద్రిని చూస్తే ఎంతో అసూయగా ఉండేది.

ఒకసారి వర్షాలు సరిగా లేక పొలంలోని బావిలో నీరు బాగా అడుగుకు వెళ్లిపోయి పొలానికి నీరు పెట్టడం కష్టమవుతుండే సరికి సాటి రైతులను కలుపుకుని ఆలోచన

పి.వి. సత్యనారాయణ

చేశాడు సింహాద్రి. తరువాత తన ఊరి వ్యవసాయాధికారితో మాట్లాడి ఆయన సలహాతో పట్నం వెళ్ళి బావినుంచి పైకి నీళ్లు తోడే యంత్రాన్ని ఒకదానిని కొనుగోలు చేశాడు సింహాద్రి.




దానివల్ల నీరుతోడే శ్రమ తప్పడంతో పాటు పొలానికి తగిన నీరు చక్కగా అందడంతో అతని పొలంతో బాటు అతను కలుపుకున్న రైతుల పొలాలు కూడా ఆ యేడు బాగా పండాయి. ఆ తరువాత సింహాద్రి సలహాతో ఆ ఊళ్లోని మరికొంతమంది రైతులు కూడా జట్లుగా ఏర్పడి ఉమ్మడిగా అలాంటి యంత్రాలను కొనుక్కుని లాభపడ్డారు.

రాములుకి ఈ విషయం ఆలస్యంగా తెలిసింది. అదీగాక అతని బావిలో నీరు కూడా ఆ సంవత్సరం చాలా లోతుకు పోయింది. తనుకూడా పొలంలో అలాంటి నీళ్ల తోడే యంత్రాన్ని పెట్టుకోవాలనుకున్నాడు.

అయితే అతనికి నలుగురినీ కలుపుకోవడం ఏమాత్రం ఇష్టం లేదు. అలాగని తన దగ్గర కూడా తగినంత డబ్బు లేకపోవడంతో తప్పనిస్థితిలో ఊళ్లోని వరాల సెట్టి దగ్గర అప్పు తీసుకున్నాడు.

'ఈ సారి నా పొలం విరగపండితే ఈ అప్పు మొత్తం తీర్చడం ఎంత పని' అని కూడా అనుకున్నాడు రాములు.

తను నీళ్లు తోడే యంత్రం కొంటున్న విషయం తోడల్లుడికి తెలియడం రాములికి ఇష్టం లేకపోయింది. అలాగని ప్రక్క ఊళ్లో ఆ యంత్రాలను కొనుక్కున్న వాళ్ల సాయం తీసుకుందామన్నా వాళ్లు సింహాద్రికి చెప్పేస్తారని ఆలోచించి చివరకు తనే పట్నం బయలు దేరాడు.

అక్కడ నీరు తోడే యంత్రాల గురించి వాకబు చేస్తుంటే అతని వాలకం కనిపెట్టిన మనిషొకడు రాములుకి ఇటువంటి కొనుగోలులో ఎలాంటి అనుభవం లేదని కనిపెట్టేశాడు. తాను మంచి యంత్రాన్ని కొనిపిస్తానని నమ్మబలికి, తనకు ఏదయినా వస్తువు అమ్మిపెడితే డబ్బు ముట్టజెప్పే వర్తకుని దగ్గరకు తీసికెళ్లి రాములు చేత నాసిరకం యంత్రాన్ని కొనిపించి వెళ్లిపో



లనుకుంటే ఇలాగయిందేమిటి దేవుడా అనుకుంటూ ఏం చెయ్యాలో పాలుపోని రాములు పొలం గట్టుమీద నిలబడి దీనంగా నిలబడ్డాడు.

అది చూసిన ఎల్లన్న అనే రైతు రాములుతో మాట్లాడి విషయం రాబట్టాడు. 'మీ తోడల్లుడి ఊళ్లో కొన్నవన్నీ బాగానే పని చేస్తున్నాయి కదా మావా! నీదొక్కటీ పని చేయడం లేదంటే దీనికి దయ్యం పట్టిందేమో... రక్తం తాగినట్లు చమురు తాగేస్తోంది. పోనీ గణాచారి చేత తాయెత్తు కట్టించి చూడు,' అని సలహా ఇచ్చాడు.

రాములుకి ఇప్పుడింకో దిగులు పట్టుకుంది. తన పొలంలో దయ్యం ఉందని తెలిస్తే తక్కిన పొలం పనులకు పనివాళ్లు రారు. దానితో ఏటా పండే గింజలు కూడా రాలకపోతే తన బ్రతుకేంగాను?

అందుకే ఊళ్లోని గణాచారిని బతిమాలి చాటుగా తీసుకొచ్చి ఒకరోజు రాత్రిపూట తన పొలంలో నీటియంత్రానికి పూజ చేయించి తాయెత్తు కట్టించాడు గణాచారి. అందుకు రాములు దగ్గరనుండి బాగానే డబ్బులు వసూలు చేశాడు.

ఇంతచేసినా రాములుకి ఫలితం లేకపోయింది. తాయెత్తు దారి తాయెత్తుదే అయింది. నీటియంత్రం యథాప్రకారం చమురు తాగుతూనే ఉంది.

పైగా ఆనోటా ఈనోటా ఈ కబురు కూలీలకు తెలిసిపోయి వాళ్లు భయపడి

యాడు. ఆ తర్వాత చల్లగా మళ్లీ వెళ్లి తనకు రావలసిన డబ్బును వర్తకుని దగ్గర వసూలు చేసుకున్నాడు.

తానొకటి తలిస్తే దైవం ఒకటి తలిచాడన్నట్లు తయారయింది రాములు పరిస్థితి. నీళ్లు తోడే యంత్రం సాయంతో లాభాలు గడిద్దామనుకున్న రాములుకు ప్రాణం విసుగెత్తిపోయింది.

ఎందుకంటే నెలనెలా యంత్రానికి పోసే చమురు ఖర్చు రానురాను ఎక్కువ కాసాగింది. నిజానికి ఆ ఖర్చుతో పదిమంది కూలీలను పెట్టుకుని నీళ్లు తోడించుకోవచ్చును.

తన తోడల్లుడికంటే ఈ ఏడాది ఎక్కువ దిగుబడి సాధించి తన గొప్ప చూపించా

పొలం పనులకు రావడం మానుకున్నారు. దాంతో రాములు మంచం పట్టలేదు తప్ప బాగా కుంచించుకుపోయినట్లు అయిపో యాడు.

ఇంతలో ఒకరోజు అనుకోకుండా వాగు లాపల్లిలోని గ్రామాధికారితో పనుండి ఆ ఊరు వచ్చిన సింహాద్రి ఆ పని పూర్తయ్యాక తోడల్లుడిని చూసేందుకు రాములింటికి వచ్చాడు.

రాములు ఏమీ చెప్పకపోయినా పొలా నికి వెళ్లగానే లోపం ఎక్కడుందో అతనికి విషయం అర్థమయిపోయింది.

'అన్నగారూ! మీరేమీ అనుకోనంటే ఒక విషయం చెప్తాను. వినండి. ఏదయినా కొత్త వస్తువు కొనేటప్పుడు నలుగురిని సంప్ర దించి కొంటే దాని మంచి చెడ్డలు తెలు స్తాయి. నిజానికి మీ నీళ్లు తోడే యంత్రం పనిచేయకపోవడానికి కారణం, దయ్యం పట్టడం కానే కాదు. అది నాసి రకంది.

మరో ముఖ్యమైన విషయమేమిటంటే మీరు యంత్రానికి సంబంధించిన గొట్టాన్ని బావిలోని నీటిమట్టం కంటే చాలా ఎక్కువ ఎత్తులో పెట్టించారు. అందుకే ఎక్కువ చమురు తాగుతోంది. దాని ఎత్తును సరి చేస్తే మీ సమస్య తీరుతుంది.'

రాములుకు అర్థమయింది. దయ్యం పట్టింది తన నీటి యంత్రానికి కాదు. తనకే అసూయ అనే దయ్యం పట్టింది. తను సింహాద్రి మీద అసూయ పడి అతని కంటే ఎత్తుకు ఎదగాలనే దుగ్ధతో తప్పుదోవలో నడిచినా అదేమీ పట్టించుకోకుండా తన సమస్య తీరేందుకు పరిష్కారం చెప్పిన తోడల్లుడి మంచి మనసుకు కృతజ్ఞతలు అర్పిస్తూ తలవంచుకున్నాడు.

ఆ తరవాత రాములు కూడా సింహాద్రి బాటలోనే నడిచి నలుగురి చేత మంచి అనిపించుకోవడమే కాకుండా మంచి దిగు బడులు కూడా సాధించాడు.





# పంచతంత్ర కథలు

కరటకం దమనకానికి చిలుకల కథ చెప్పి, 'నువు ఈ పనంతా నీ మిత్రుడైన సింహం కోసం చేశానని సమర్థించవచ్చు. కాని నిన్ను ఒక్క విషయం చెప్పనియ్యి, మూర్ఖుడైన మిత్రుడి కన్న వివేకం గల శత్రువు మేలు. ఇందుకు తార్కాణంగా ఒక దొంగ తన ప్రత్యర్థుల కోసం చచ్చాడు. ఒక కోతి తన మిత్రుడైన రాజును చంపింది,' అన్నది.

'అది ఎలా జరిగింది?' అని దమనకం అడిగింది.

కరటకం ఆ కథ ఇలా చెప్పింది.

పూర్వం కౌశాంబీ రాజ్యంలో ఒక రాజ కుమారుడు ఉండేవాడు. అతను అస్తమా నమూ బ్రాహ్మణమంత్రి కొడుకుతోనూ, వైశ్యకోశాధికారి కొడుకుతోనూ తిరిగేవాడు. వాళ్లు ఆప్తమిత్రులుగా ఉంటూ, వినోదాల తోనూ, క్రీడలతోనూ, వాహ్యాళితోనూ, ప్రసం గాలతోనూ కాలక్షేపం చేసేవాళ్లు.

ఈ సాంగత్యం వల్ల రాజకుమారుడికి విలువిద్యగాని, కత్తిసాము గాని, అశ్వగ జారోహణలు గాని ఇతర క్షత్రియ విద్య గాని కొంచెమైనా అబ్బలేదు.

'రాజవిద్యలేవీ నేర్చావు కావు. ఎలా రాజరికం నెరుపుతావురా?' అని రాజు తన కొడుకును ఒకనాడు అడిగాడు.

ఈ మాట అనిపించుకున్నందుకు రాజ కుమారుడు చాలా నొచ్చుకుని, తన మిత్రు లతో ఈ మాట చెప్పాడు.

దానికి వాళ్లు 'మా తండ్రులు కూడా అస్తమానమూ మిమ్మల్ని ఇలాగే తప్పు పడుతున్నారు. కులవిద్యలు నేర్చుకోక మేము ఎందుకూ కాకుండా పోతున్నా

మిత్రభేదం – **30**

మట. ఇప్పుడు నీకు కూడా అటువంటి అవమానమే జరగటం చూసి, అందరికీ దుఃఖంగానే ఉన్నది.' అన్నారు.

రాజకుమారుడు ఇలా అన్నాడు.

'అవమానం జరిగిన చోట నిలవరాదు. మన ముగ్గురినీ పెద్దవాళ్లు అవమానించారు. మనం ఎటైనా వెళ్ళిపోయి, మన మీద వచ్చిన ఆరోపణలు అసత్యమమని నిరూపించుదాం.'

ఇందుకు మిగిలిన ఇద్దరూ సరేనన్నారు. అయితే ఎక్కడికి వెళ్ళాలన్న ప్రశ్న వచ్చింది. ముగ్గురూ చాలాసేపు వితర్కించిన మీదట కోశాధికారి కొడుకు ఇలా అన్నాడు.

'ధనం లేక మనం ఏదీ సాధించలేం. మనం రోహణ పర్వతం మీదికి వెళదాం. అదృష్టం ఉంటే అక్కడ మనకు ఎంతో విలువైన ఇంద్రనీల మణులు దొరకవచ్చు. వాటితో మన ఆశయాలన్నీ సిద్ధిస్తాయి.'

ఇందుకు మిగిలిన ఇద్దరూ ఒప్పుకున్నారు.

పుష్కలంగా ధనం తీసుకుని ముగ్గురూ రోహణ పర్వతానికి ప్రయాణమయ్యారు. అదృష్టం కలిసి వచ్చి, వాళ్లు శ్రమపడి వెతికిన మీదట, ఒక్కొక్కరికి ఒక్కొక్క వెలలేని ఇంద్రనీలమణి దొరికింది.

'అరణ్యమార్గం క్షేమకరం కాదు కదా. మనం ఈ రత్నాలతో ఎలా తిరిగి పోవటం?' అని వాళ్లు ఆలోచించారు.



'నేను మంత్రి కొడుకును గనక, ఇటువంటి సమస్యలను పరిష్కరించడం నాకు తెలుసు. దీనికి ఉపాయం నేను ముందుగానే ఆలోచించాను. మనం మన రత్నాలను అన్నం ముద్దలో పెట్టి మింగేద్దాం. అవి మన పొట్టలలో భద్రంగా ఉంటాయి. వాటిని ఏ దొంగలూ వెతికి తీసుకోలేరు. మనం ఎల్లుండికి రత్నపురం చేరుతాం. అక్కడ మనం ఆముదం తీసుకుని రత్నాలను వెలికి తెప్పించుకుందాం,' అన్నాడు మంత్రికొడుకు.

మిగిలిన ఇద్దరికీ కోశాధికారి కొడుకు చెప్పిన ఉపాయం నచ్చింది. ముగ్గురూ భోజనంతో బాటు తమ తమ ఇంద్రనీలాలను మింగేశారు.

సుబుద్ధి అనేవాడు ఈ ముగ్గురికీ కన బడకుండా ఒక పల్లపు ప్రదేశంలో ఉండి, మంత్రి కొడుకు చెప్పే మాటలను వింటూ, ముగ్గురూ ఇంద్రనీలాలు మింగటాన్ని చూశాడు. వాడు కూడా ఇంద్రనీలాల కోసం ఆ కొండకు వచ్చినవాడే!

ఈ ముగ్గురి అదృష్టమూ ఎలాంటిదో గాని, వీళ్లకు అద్భుతమైన మణులు దొరి కాయి. నేను కూడా వీళ్లతో చేరి ప్రయాణం చేసి, రాత్రిపూట వాళ్లు అలసి గాఢనిద్రలో ఉన్నప్పుడు ముగ్గురి పొట్టలూ కోసి, మూడు మణులూ తీసుకుంటాను, అను కున్నాడు సుబుద్ధి.

ఇలా అనుకుని వాడు ఒక అరమైలు దూరం ముందుకు నడిచి, ఒక చోట ఆగాడు. త్వరలోనే ముగ్గురూ అటుగా వచ్చారు. అప్పుడు సుబుద్ధి వాళ్లతో. 'మిత్రులారా, ఈ భయంకరమైన అర ణ్యాన్ని ఒంటరిగా దాటాలంటే భయంగా ఉన్నది. మాది రత్నపురం. నేను అక్కడికే పోతున్నాను. దయచేసి నన్ను మీ వెంట రానిస్తారా?' అన్నాడు.

మరొకడు తోడు ఉంటే మరింత బాగుం టుందని వాళ్లు సుబుద్ధిని తమ వెంట రానిచ్చారు. ఆ మహారణ్యం మధ్యన దారిని ఆనుకుని ఒక దొంగల పల్లె ఉన్నది. దొంగల నాయకుడి ఇల్లు దారిమీదికే ఉన్నది. వాడి వద్ద అనేక పక్షులున్నవి. అందులో ఒక పక్షికి, దారే వెళ్లేవాళ్లను గురించి తెలుసుకునే అద్భుత శక్తి ఉండేది. నలుగురు బాట సార్లు దొంగలనాయకుడి ఇంటిముందు నుంచి వెళుతుండగా ఆ పక్షి గొంతు చించు కుని అరిచింది.

దాని భాష తెలిసిన దొంగలనాయకుడు తన నౌకర్లను పిలిచి, 'ఆ వెళ్లే వాళ్ల దగ్గర రత్నాలున్నాయని పక్షి చెబుతున్నది. వాళ్ళను పట్టుకోండి!' అన్నాడు.

(ఇంకా వుంది)





# నా బంగారు చేప ఎక్కడ?

భవానికి ఒక్కసారిగా దిగ్భ్రాంతి కలిగింది. ఉదయాన్నే నిద్ర లేచిన వెంటనే ఆమె ముందు గదిలోని చేపల తొట్టి వైపు అడుగేసింది. తొట్టిలోని చేపలను ప్రత్యేకించి బంగారు చేపను చూస్తే ఆమెకు చాలా సంతోషంగా ఉంటుంది. చేపలను పలుకరించిన తర్వాతే ఆమె కాలకృత్యాలు తీర్చుకోవడానికి వెళుతుంది. కాని ఈ రోజు ఆమెకు ఇష్టమైన బంగారు చేప కనిపించలేదు. భవాని నిరాశలో కూరుకుపోయింది. ఎక్కడికెళ్ళి ఉంటుందది? గతరాత్రి పిల్లి లేదా కుక్క ఏదైనా ఇంట్లో దూరి తన బంగారు చేపను తినేసి ఉంటుందేమో అనుకోవడానికీ లేదు. ఎందుకంటే పిల్లి, కుక్కా తోస్తే బద్దలయేంత బలహీనంగా తొట్టిలేదు.

ఆమెకు ఏడుపు తన్నుకొచ్చింది. చేపల్లోనే బంగారు చేప రత్నం లాంటిది. కిటికీలోంచి సూర్యకాంతి పడుతుంటే ఈ చేప అద్భుతమైన రంగుతో ప్రకాశిస్తుంది. క్షణం కాలం కూడా విశ్రాంతి లేకుండా అది ఈదుతూనే ఉంటుంది.

భవాని ఈ విషయమై 'అమ్మా ఈ చేపకు విశ్రాంతి అన్నది ఉండదా?' అని అమ్మను చాలా సార్లు అడిగింది.

'ఎందుకు లేదు, దానికి కూడా విశ్రాంతి అవసరం!' అంటూ అమ్మ కూడా చెప్పిందే చెబుతూ ఉంటుంది.

'లేదమ్మా! అది ఖాళీగా ఉండటం నేనెన్నడూ చూడలేదు. అది ఎప్పుడూ చురుగ్గానే కదులుతూ ఉంటుంది'.

'భవానీ, బంగారు చేప నిన్ను బాగా ఇష్టపడుతోందేమో! అందుకే అది ఎప్పుడూ నీ ముందే కదలాడుతుంటుంది కాబోలు.'

భవాని అమ్మతో ఏకీభవించింది. ఈ

టి. వెంకటేశన్



బంగారు చేపే ఇప్పుడు తప్పిపోయింది. నిజంగానే స్నేహంగా ఉంటాయా! స్నేహితురాళ్లు కనబడకపోయినా వాటికి పట్టదేమో.

భవాని ఏడవసాగింది. ఆమె తొట్టిలోకి తొంగిచూసింది. చేపల తొట్టిలోని నీరు నేలమీదికి కారి ఉండటం గమనించింది. నీరు గది పొడవునా ప్రవహించి ఇంటి ముఖ ద్వారం వద్ద నిలిచింది. ఉన్నట్లుండి ఆమెకు ఒక విషయం తట్టింది. తన స్నేహితులు ఎవరో ఇంట్లో ప్రవేశించి బంగారు చేపను తస్కరించి ఉండవచ్చు. వాళ్లు గాభరాతో ఈ పనిచేసినందువల్లే నీళ్లు గదంతా వ్యాపించాయి కాబోలు. అయినా ఎవరీపని చేసి ఉంటారు? ఖచ్చితంగా తన స్నేహితుల లోనే ఎవరైనా ఈ పని చేసి ఉండవచ్చు. ఎవరు వారు? రమ్య? రాధ? రవి? మనసులో సందేహం పొడసూపగానే భవాని వెంటనే రమ్య ఇంటికి పరుగెత్తింది.

రమ్యను కలిసి మాట్లాడిన తర్వాత తన మనస్సులో ఆమెపై సందేహాన్ని తుడిచేసిందామె. తర్వాత రాధ ఇంటికెళ్లింది. రాధతో మాటలాడుతున్నప్పటికీ ఆమె చూపు ఆ ఇంట్లోని చేపల తొట్టిపైకి మళ్లింది. రాధ వాళ్ల ఇంట్లోని చేపల తొట్టిలో బంగారు చేప కనిపించలేదు. రాధ మాత్రం భవాని ఏదో తీవ్రంగా విచారపడుతున్నట్లు పసిగట్టి, నిజం చెప్పమంటూ రాధ ప్రాధేయపడింది. భవాని వెక్కిళ్లు పెడుతూ జరిగింది చెప్పి బంగారు చేపకోసం వెతుకుతున్న విషయం బయటపెట్టేసింది.

'భవానీ, ఆ చేపను ఎవరు దొంగిలించారో నాకు తెలుసు. గంట క్రితం రవి మీ ఇంట్లోకి వెళుతుండటం చూశాను అప్పటికి నీవింకా నిద్ర లేవలేదు. అతను కాసేపట్లో మళ్లీ తిరిగొచ్చాడు. అతడే చేపను దొంగిలించి ఉంటాడని నా అభిప్రాయం. అతడి ఇంటికి పోదాం పద.'

ఇద్దరు అమ్మాయిలూ రవి ఇంట్లోకి ప్రవేశించారు. రవి అమ్మ వారిని ఆహ్వానించింది. 'ఏమైందమ్మా? ఈరోజు పాఠశాలకు సెలవు కదా, నాకు తెలుసు. రవినుంచి ఏవయినా నోట్ పుస్తకాలకోసం వచ్చారా?'

'లేదు పిన్నీ, భవాని చేపల తొట్టి నుంచి బంగారు చేప తప్పిపోయింది. ఈ విషయం తనకు తెలుసునేమో అని మేం రవిని అడగడానికి వచ్చాం. అంతే.'

వెంటనే రవి వాళ్లమ్మ రవిని పిలిచింది. కాని అతడు మిద్దె పైనుంచి కిందికి రాలేదు. అమ్మ పదే పదే పిలిచినా రాలేదు. అప్పుడు వాళ్లమ్మ తానే మిద్దెమీదకు వెళ్లి రవిని బల వంతంగా లేవదీసుకుని వచ్చింది.

'చూడరా, భవాని బంగారు చేప గురించి నీకేమైనా తెలుసా?'

'నాకా, బంగారు చేప గురించా? నాకేం తెలుసు?' రవి వాదించాడు.

'కాని నీవు పొద్దున్నే భవాని ఇంటికి వచ్చావు గదా?' అన్నది రాధ. 'అక్కణ్ణుంచి దేన్నో దాపెట్టుకుని వచ్చినట్లుంది.'

'నేనా, లేదు లేదు. నేను ఏ బంగారు చేపనూ దొంగలించలేదు. నన్ను వదిలివే యిండి!' అంటూ రవి తన తల విదిల్చాడు. భవాని బాగా నిరాశపడి, పక్కనున్న కుర్చీలో కూలబడింది. 'భవానీ! ఏం జరిగింది?' అంటూ రవి వాళ్ళమ్మ కేకపెట్టింది.

'నాకు కాసిన్ని నీళ్లు కావాలి పిన్నీ. నాకేమీ పాలుపోవడంలేదు.'

వెంటనే రవి వాళ్ళమ్మ గ్లాసుతో కుండలో నీళ్లు తీసుకుని వచ్చింది. నీళ్లగ్లాసును భవా నికి ఇచ్చింది.

గ్లాసుకేసి చూస్తూ, పిన్నీ..!!! అంటూ గావుకేక పెట్టింది భవాని. ఆమె ప్రాణంగా చూసుకునే బంగారు చేప గ్లాసులోని నీళ్లలో ఈదులాడుతోంది.

'బంగారు చేప! ఇక్కడ ఉంది! ఆహా, అద్భుతం..' అంటూ రాధ కేకపెట్టి చప్పట్లు చరిచింది.

రవి వాళ్లమ్మ నివ్వెరపోయింది. అప్ప టికే పాలిపోయిన ముఖంతో కనబడుతున్న రవికేసి చూసింది.

'నిన్ను నా కొడుకు అని చెప్పడానికి సిగ్గు పడుతున్నానురా. చేపను దొంగిలించి తెచ్చి నందుకు భవానికి క్షమాపణలు చెప్పు.'

'వదిలేయండి పిన్నీ!' అన్నది భవాని గ్లాసును తన హృదయానికి పొదువు కుంటూ. 'ఏమైతేనేం.. నా బంగారు చేపను నేను మళ్లీ దక్కించుకున్నాను.'





# మోక్షార్హత

మళ్ళీ పౌర్ణమి వచ్చింది. పిండారబోసినట్టున్న వెన్నెలలో తాతయ్య పడకకుర్చీలో కూచున్నాడు. పిల్లలు ఆయన చుట్టూ కూచున్నారు. తాతయ్య ఏదో ఆలోచించుకుని తనలో తాను నవ్వుకున్నాడు. తరవాత ఈ శ్లోకం చదివాడు:

'మనసా బధ్యతే జీవో,
మనసైవ విముచ్యతే --
దేవదాసో గతో బంధం
వేశ్యాదాసో విమోచితః'.

'అంటే ఏమిటి తాతయ్యా?' అని పిల్లలు అడిగారు.

తాతయ్య వెంటనే జవాబివ్వక రొండి నుంచి పొడుంకాయ తీసి, చిటికెడు పొడుం పట్టి, పెద్ద చప్పుడు చేస్తూ పీల్చి, 'ఈ శ్లోకానికి అర్థమేమిటీ అని కదూ అడుగుతున్నారూ? చెబుతాను వినండి. జీవుడు మనసుచేత బంధించబడి ఉంటాడు సుమా! ఆ మనసువల్లనే మోక్షాన్ని కూడా పొందుతాడు! వెనకటికి దేవదాసు అనేవాడు నరకానికి పోగా వేశ్యాదాసు ఏకంగా మోక్షం పొందాడు గదా! అని,' అన్నాడు.

'దేవదాసు ఎవరు తాతయ్యా... వేశ్యాదాసు మోక్షం ఎందుకు పొందాడు? ఆ కథ ఏమిటి తాతయ్యా?' అని పిల్లలు తలా ఒక ప్రశ్న వేశారు.

'ఆ కథ చెప్పమంటారా ఏమిటి? చెబుతాను వినండి మరి!' అన్నాడు తాతయ్య.

అనగా అనగా అవంతీ అని ఒక నగరం. ఆ నగరంలో ఒకే వయసు గల ఇద్దరు బ్రాహ్మణ యువకులు ఉండేవారు. వారిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. అయితే వాళ్ళ నడతలో మట్టుకు చాలా తేడా ఉండేది. ఆ ఇద్దరిలోనూ నీతిమంతుడు,

సి.శేషాద్రి

ఎప్పుడూ దేవపూజా, జపాలూ చేస్తుండే వారు. సాయంకాలం భజన చేసేవాడు. వాడి ధోరణి చూసి అందరూ వాణ్ణి దేవదాసు అని పిలిచేవారు. ఇక రెండో వాడున్నాడే వాడు ఎపుడూ వేశ్యల ఇళ్లలో ఉంటూ సుఖాలతో కాలం వెళ్లబుచ్చేవాడు. ఇకనే, వాడికి వేశ్యాదాసు అని పేరు పడిపో యింది.'

అయిందా? వీళ్ళిద్దరూ పైకి ఎలా ఉన్న ప్పటికీ వీళ్ల మనసులెలా ఉండేవని అడ గరేం? దేవదాసు ఉన్నాడే, వాడెప్పుడూ తన మనసులో, ఆహా ఈ వేశ్యాదాసుగాడు ఎంత సుఖపడిపోతున్నాడు! నాకు ఒక్క సుఖమూ లేదు కదా, అని కుళ్లుతూ ఉండే వాడు. ఇకవేశ్యాదాసేమో తన స్నేహితుడు చక్కని పుణ్యజీవితం గడుపుతున్నాడనీ, వాడికి మోక్షం వస్తుంది గదా అనీ లోలోపల అనుకునేవాడు.

ఈవిధంగా వాళ్లు కొంతకాలం జీవించి చనిపోయారు. అప్పుడు ఏమయిందో తెలుసా? యముల వాళ్లు వచ్చి దేవదా సును నరకానికి, విష్ణు కింకరులు వచ్చి వేశ్యాదాసును మోక్షానికి ఉన్న ఫళానా తీసుకుని పోయారు.

'ఇదేమి అన్యాయం? ఆ వేశ్యాదా సుకు మోక్షమూ, నాకు నరకమూనా?' అన్నాడు దేవదాసు.

'ఏం చేస్తాం? నీ మనసెప్పుడూ వేశ్యల మీదనే ఉండె, ఆ వేశ్యాదాసు అస్తమా నమూ మోక్షం గురించే ఆలోచించేవాడు. ఆత్మశుద్ధి ముఖ్యం గాని చేసే పనులు కావు!' అని జవాబు చెప్పారు యముల వాళ్లు.

అందుకే పెద్దలేమన్నారంటే--

'నకాష్ఠే విద్యతో దేవో,
నపాషాణే, నమృణ్మయే,
భావేతు విద్యతే దేవ
స్తస్మాద్భావోహి కారణమ్

(దేవుడు కర్రలోనూ, రాతిలోనూ, మట్టి లోనూ లేడు సుమా, మన బుద్ధిలోనే ఉన్నాడు. అన్నిటికీ బుద్ధే మూలకారణం!)' అన్నాడు తాతయ్య.






# నమ్మకద్రోహం

వత్సదేశానికి రాజధాని ఐన అమరావతీ నగరంలో, నరవాహనదత్తుడు పరిపాలన చేసే కాలంలో, వసుధరుడనే పేదవాడు బరువులు మోసి జీవిస్తూండేవాడు.

ఇటువంటి గర్భదరిద్రుడికి ఒకనాడు రాచనగరు ద్వారం సమీపంలో రత్నాలు పొదిగిన కంకణం ఒకటి దొరికింది. వసుధరుడు దానిని తన ఇంటికి తీసుకుపోయి, కంకణం నుంచి ఒక రత్నం ఊడగొట్టి, హిరణ్యగుప్తుడనే రత్నవర్తకుడి దగ్గిరికి పట్టుకుపోయాడు.

హిరణ్య గుప్తుడు దానిని పరీక్షించి, 'రత్నం మేలుజాతిది. నువు అమ్మేటట్టయితే, లక్ష దీనారాలిచ్చి కొంటాను. అమ్మి డబ్బు పుచ్చుకుంటావా?' అని అడిగాడు హిరణ్య గుప్తుడు.

'అంత డబ్బు నేను మాత్రం ఎక్కడ దాచేది, బాబూ? మీ దగ్గరే ఉంచండి. నాకు కావలిసినప్పుడల్లా వచ్చి తీసుకుంటాను!' అన్నాడు వసుధరుడు.

తరవాత వాడు అయిదుసార్లుగా అయిదు వేల దీనారాలు తీసుకుని రాజభోగంగా తింటూ, తాగుతూ, మంచి బట్టలు వేసుకుని ఉల్లాసంగా తిరగసాగాడు.

అమరావతీ నగరంలోనే రత్నదత్తుడనే వర్తకుడున్నాడు. ఆయన వసుధరుడిచేత చాలా సార్లు సరుకులు మోయించుకున్నాడు. వాడు ఇటీవల తన వద్దకు రాకపోవడం రత్నదత్తుడు గమనించి, ఇతర కూలీలను అడిగితే వాళ్లు 'వాడిప్పుడు కూలి కెందుకు వస్తాడు బాబూ? చాలా గొప్పవాడైపోయాడు. వాడి చేతిలో లక్ష్మి

బి. అంకరాజు

తాండవం చేస్తున్నది!' అని చెప్పారు.

వసుధరుడికి సిరి ఎట్లా వరించింది తెలుసుకోవాలని రత్నదత్తుడికి కోరిక కలిగింది. ఆయన వాణ్ణి మంచిగా పిలిపించి, 'ఒరే నీకు మంచిరోజులు వచ్చినట్లు విన్నాను. ఒకపూట మా యింట భోజనం చేసి వెళ్లు. మనం మనం చాలాకాలపు స్నేహితులం కదా!' అన్నాడు.

వసుధరుడు దానికి ఒప్పుకున్నాడు. రత్నదత్తుడు వాడిచేత బాగా తాగించి. మంచి మాటలతో, వాడి రహస్యమంతా తెలుసుకున్నాడు. తరవాత రత్నదత్తుడు వసుధరుడిని ఇంటికి పంపేసి, రాజుగారి దగ్గిరికి వెళ్ళి అంతా చెప్పేశాడు.



'మహాప్రభూ, అంత వెల గల కంకణం తమదే అయి ఉండాలి. విచారణ చేసి న్యాయం చేయాలి' అన్నాడు రత్నదత్తుడు.

ఈ మాట వినగానే నరవాహనదత్తుడికి తన కంకణం పోయిన సంగతి జ్ఞాపకం వచ్చింది. కొంత కాలం క్రితం ఆయన ఊరేగింపు వెళ్లివచ్చాక చేతి కంకణం ఒకటి కనిపించలేదు. దానికోసం వెతికించమని ఉత్తరువు చేశాడు. తిరిగి దాని విషయం ఆయనకు జ్ఞాపకం రానేలేదు.

నరవాహనదత్తుడు కంకణంతో సహా వసుధరుణ్ణి ఆస్థానానికి పిలిపించాడు. కంకణం రాజుదే అని తేలింది. దానిమీద ఆయన పేరు కూడా ఉన్నది. 'దీని మీద మా పేరు ఉండటం చూసి కూడా ఏమని నీ సొంతం చేసుకున్నావురా?' అని రాజు వసుధరుడిని గద్దించి అడిగాడు.

'కూలిమూటలు మోసుకునే వాణ్ణి. నాకు దానిమీద ఏం రాసుందో ఎట్టా తెలుస్తుంది దొరా?' అన్నాడు వసుధరుడు.

'పోనీ, ఇది ఎవరిదని నలుగుర్ని విచారించలేకపోయావా?' అన్నాడు రాజు.

'నావంటి పేదవాడి దగ్గిర ఇంత గొప్ప నగ ఎవరన్నా చూశారంటే ముందు దొంగతనం అంటగట్టి తరవాత మాట్లాడతారే?' అన్నాడు వసుధరుడు.

ఇదంతా వింటున్న వృద్ధ మంత్రి యౌగంధరాయణుడు, 'వాడు నిర్దోషి, పోనివ్వండి! హిరణ్య గుప్తుడికి, రత్నంతో సహా రమ్మని కబురు పంపండి,' అన్నాడు.

కొద్ది సేపట్లోనే హిరణ్యగుప్తుడు రత్నంతో సహా వచ్చాడు. ‘‘ఏమయ్యా, ఈ కంకణం మీద మా పేరుండటం చూసి కూడా ఇందులోని రత్నాన్ని ఏమని కొన్నావు? ఈ నేరం కారణంగా నీవు దండనార్హుడివి కావా,’ అన్నాడు రాజు.

‘ప్రభూ, నేనీ కంకణం ఎన్నడూ చూడ లేదు. వసుధరుడనే వాడు నా దగ్గిరికి వచ్చి ఈ రత్నం మాత్రం తెచ్చి అమ్మాడు. పేద వాడు కదా అని నేను అన్యాయం చేయ లేదు. న్యాయమైన వెలకే దాన్ని కొన్నాను. వాడు నా దగ్గర అయిదువేల దీనారాలు మాత్రమే పుచ్చుకున్నాడు. మిగిలిన సొమ్మంతా నావద్దే ఉన్నది,’ అన్నాడు హిరణ్యగుప్తుడు.

‘అంత పేదవాడికి ఇంత వెలగల రత్నం ఎలా వచ్చింది? దొంగిలించాడేమోనని నీకు అనుమానం కలగలేదుటయ్యా?’ అన్నాడు రాజు.

‘ప్రభూ, మా వృత్తి వర్తకం చేసుకోవడం. అంతేకాని దొంగలను పట్టడం కాదు. మా ధర్మం మేము తప్పి నడిచినప్పుడు ధర్మ ప్రభువులు మమ్మల్ని చిత్తానుసారమూ దండించవచ్చు!’ అన్నాడు హిరణ్యగు ప్తుడు.

‘అతను నిర్దోషి. అయిదువేల దినా రాలూ తిరిగి ఇప్పించి, అతన్ని పంపించే యండి!’ అన్నాడు యౌగంధరాయణుడు. రాజుగారు బహుకరిస్తారని రత్న దత్తుడు ఉత్సాహంగా వచ్చాడు.

కాని అతడిని చూస్తూనే యౌగంధరా యణుడు, ‘‘ఏమయ్యా నీ ప్రవర్తన మాకేమీ నచ్చలేదు. నీవు వసుధరుడిని నమ్మించి మోసం చేశావు. కాని ఇది మొదటి తప్పు కనుక క్షమిస్తున్నాము!’ అన్నాడు.

రత్నదత్తుడు యౌగంధరాయణుడి మందలింపుతో సిగ్గుతో తలవంచుకుని వెళ్లిపోయాడు.





# కోడి ఖరీదు

ఒక గ్రామంలో పేరయ్య అనే కుమ్మరి ఉండేవాడు. ఒక ఏడు సంక్రాతి వచ్చింది. పేరయ్యను అతని భార్య కోడిని కొను క్కురమ్మని అడిగింది. ఆ గ్రామంలోని పెద్ద భూస్వామి అయిన కోటయ్య వద్దకు వెళ్లి పేరయ్య తనకు ఒక కోడిని అమ్మ వలసిందిగా అతణ్ణి అడిగాడు.

కోటయ్య పేరయ్యకు ఒక కోడిపెట్టను ఇచ్చి, 'చేతిలో ఇప్పుడు డబ్బులేకపోతే, తరవాతనే ఇవ్వు, లెక్క రాయించి ఉంచు తాను,' అన్నాడు. పేరయ్యకు ఈ మాత్రం ఆదరం చూపినవారెవ్వరూ లేరు. అందు చేత అతను కోటయ్య దయాధర్మాలను చాలా సేపు మెచ్చుకుని ఇంటికి వెళ్లాడు.

ఆ రోజు పేరయ్యా, అతని భార్యా కోడిని వండుకు తిన్నారు. కొంతకాలం గడిచాక పేరయ్య భూస్వామికి కోడి బాపతు సొమ్ము ఇవ్వటానికి వచ్చాడు.

'ఇప్పుడు నేను పనిమీద ఉన్నాను. ఆ లెక్క చూడాలంటే చాలాసేపు పడు తుంది. తరువాత కనపడు!' అన్నాడు కోటయ్య.

'కోడి ఖరీదు పుచ్చుకోవడానికి లెక్క చూసేదేముందండి. ఎంత ఇయ్యామం టారో చెప్పండి, ఇచ్చి నా దారిన నేను పోతాను,' అన్నాడు పేరయ్య.

'అబ్బో, దానికి చాలా పెద్ద లెక్క ఉంది' అని కోటయ్య పేరయ్యను పంపేశాడు.

పేరయ్య కోటయ్య చుట్టూ నాలు గైదు సార్లు తిరిగినాక, కోటయ్య కాగి

వి.రామరాజు

తమూ, కలమూ తీసుకుని గంటసేపు ఏవేవో లెక్కలు వేసి చివరకు, 'నీ కోడి బాపతు లెక్కంతా కలిసి రెండువందల యాభై రూపాయల చిల్లర అయింది. చిల్లరదేమిటిలే, రెండు యాభై ఇచ్చేయి, నీ పద్దు కొట్టేస్తాను,' అన్నాడు.

తాను తిన్న కోడిఖరీదు రెండువందల యాభై రూపాయలని వినగానే కొంత సేపు పేరయ్యకు నోటమాట రాలేదు. 'ఒక్క కోడి ఖరీదు రెండు వందలయాభై రూపాయలా? ఎక్కడా వినను కూడా లేదే? అదేమన్నా బంగారపు కోడా?' అని అతను కోటయ్యను అడిగాడు.

'లెక్కలో తభావతు ఏమీ లేదు. కావలిస్తే నీ ఇష్టం వచ్చిన వాళ్లచేత లెక్కవేయించుకో నువు తీసుకున్న కోడిపెట్ట ఇప్పటికి ఎన్ని గుడ్లు పెట్టేది? వాటన్నిటి ధర చెల్లించాల్సిందే,' అన్నాడు కోటయ్య.

పేరయ్య ఆశ్చర్యం పదింతలయ్యింది. 'ఈ సంగతేమిటో ఏ మునసబుగారి నన్నా అడిగి తెలుసుకోకుండా నేనొక్క దమ్మిడీ ఇయ్యను,' అన్నాడు పేరయ్య.

'మహారాజుగా అడుగు, నేనేమైనా కాదన్నానా?' అన్నాడు కోటయ్య. మునసబు తనకు అనుకూలంగానే తీర్పు చెబుతాడని కోటయ్యకు తెలుసు.

ఇద్దరూ కలిసి మునసబు దగ్గరికి వెళ్లారు. కోటయ్య మునసబుతో 'మునసబుగారు, ఈ పేరయ్య మొన్నటి సంక్రాంతికి కాక ఆ కిందటి సంక్రాంతికి



నా దగ్గర కోడిపెట్ట కొన్నాడు. దాని బాపతు సొమ్ము ఇస్తానంటున్నాడు. ఆ కోడి ఇప్పటికి ఎన్ని గుడ్లు పెట్టేదో, వాటిలో ఎన్ని పిల్లలై, మళ్ళీ అవి పిల్లలై పెరిగి, గుడ్లు పెట్టేవో, అంతా లెక్క చూసి రెండు వందల యాభై రూపాయలు అయిందన్నాను. ఇదుగో లెక్క. మీరు కూడా చూసి దీనిలో తేడా ఉందేమో చెప్పండి. అతని సొమ్ము అన్యాయంగా నేనెందుకు తింటాను?' అన్నాడు.

మునసబు ముక్కి, మూలిగి లెక్క మొత్తం పైనుంచి కిందికి చూసి, 'ఏం పేరయ్యా, లెక్కలో తప్పేమీ లేదే?' అన్నాడు.

'నేనప్పుడే చెప్పాను. పేరయ్యకు నా మాటలు నమ్మకం లేక మీదాకా తీసుకువచ్చాడు. చదువురాని వాడు లెక్కా డొక్కా తెలీదు,' అన్నాడు కోటయ్య.

పేరయ్య హతాశుడయాడు. అతను మునసబుగారి దగ్గిర సెలవు తీసుకుని దిగులుగా ఇంటికి పోతుండగా కరణంగారు ఎదురుపడి, 'ఏం పేరయ్యా! చాలా విచారంగా ఉన్నావు, ఏం జరిగిందేం?' అన్నాడు. పేరయ్య కరణంతో జరిగిన సంగతంతా చెప్పాడు.

'మునసబూ నిన్ను ముంచాడూ..? మరి నే చెప్పినట్లు చేస్తావా? కోటయ్య దగ్గిరికి వెళ్లి రేపు రచ్చబండ దగ్గిర ఈ విషయం పరిష్కారం చేసేటందుకు ఒప్పుకోమను. నీ తరపున నేను సాక్ష్యం



చెబుతానని ఆయనతో చెప్పు,' అన్నాడు కరణం. పేరయ్య కోటయ్య దగ్గిరికి వెళ్లి ఆమాటే అన్నాడు.

'మళ్లీ రచ్చబండ తీర్పేమిటి? మునసబు గారు చెప్పారు కదా?' అన్నాడు కోటయ్య.

'నాకు మీ ఇద్దరి లెక్కా అర్థం కాలేదు. రచ్చబండ దగ్గిర నలుగురూ ఏం చెబితే అలా చేస్తాను. కరణంగారు నావేపు సాక్ష్యం చెబుతానన్నారు. కరణంగారంటే మీకు భయం లేదుగా?' అన్నాడు పేరయ్య.

'నాకేం భయం?' అంటూ కోటయ్య రచ్చబండ తీర్పుకు సమ్మతించాడు.

మర్నాడు సాయంకాలం రచ్చబండ దగ్గిర అందరూ కూడారు. కాని కరణం గారి జాడ లేదు. కరణం కూడా తనను మోసం చేశాడని పేరయ్య అనుమానించసాగాడు. అందరూ పేరయ్యను చూసి నవ్వుతుండగా చీకటి పడే వేళకు కరణం గారు రానే వచ్చారు.

'నేను రావడం కాస్త ఆలస్యమైనట్టుంది. మరేం లేదు. కూలివాళ్లు ఇవాళ నారుమడి పోసి తీరాలంటే ఒక పందుం విత్తనాలు మంగలాల్లో అప్పటికప్పుడు వేయించవలసి వచ్చింది. ఆ పని పూర్తి చేసి వస్తున్నా,' అన్నాడు కరణం.

'నారుమడి చల్లే విత్తనాలు వేయించడమేమిటి కరణంగారూ? వేయించిన విత్తనాలు మొలకెత్తుతాయా?' అన్నాడు మునసబు వెటకారంగా. 'పేరయ్య తిన్న కోడి, పిల్లల్ని పెట్టగా లేనిది ఈ వేయించిన విత్తనాలు మొలకెత్తవా అని అనుకున్నాను!' అన్నాడు కరణం. అందరూ నవ్వారు. మునసబు చీకట్లోకి జారుకున్నాడు. కోటయ్య పేరయ్యను కోడి ఖరీదు మళ్లీ అడిగిన పాపాన పోలేదు.



# పనిదొంగ

కంచిపేటలో నందయ్య, మంగమ్మలకు చలపతి, రఘుపతి అనే ఇద్దరు కొడుకులుండే వారు. ఒకరోజు నందయ్యకి ఒంట్లో బాగాలేక పొలం పనులకు తన కొడుకులిద్దరినీ పంపిం చాడు. చలపతి కష్టజీవి. రఘుపతి మాత్రం పనిదొంగ. కానీ తండ్రి మాటకు ఎదురుచెప్ప లేక అన్నతోపాటు పొలం పనికి వెళ్లాడు. అన్న చలపతి రోజంతా ఎండలో కష్టపడి పని చేస్తుంటే రఘుపతి పొలం గట్టున చల్లని నీడలో హాయిగా నిద్రపోయాడు.

పొద్దుగూకే వేళకి చలపతి పని ముగించి కాలువవద్ద కాళ్లు చేతులు శుభ్రం చేసుకుం టుంటే, రఘుపతి మాత్రం ఒంటిమీద అక్కడక్కడా కొంచెం బురద జల్లుకుని పాదాలకూ కాస్త బురద పట్టించి ఇంటిముఖం పట్టాడు.

ఒంటిపై బురదతో వచ్చిన రఘుపతిని చూసిన తల్లి మంగమ్మ అన్నని గూర్చి అడిగింది. రఘుపతి, 'ఉదయం నుంచి పొలంలో పని చేశాను. చలపతి ఎక్కడెక్కడో తిరుగుతూ వెనక వస్తున్నాడు,' అని అబద్ధం చెప్పాడు. అతని కాళ్ళకూ, ఒంటికీ అంటిన బురదని చూసిన మంగమ్మ అతని మాటలు నమ్మింది. పెద్ద కొడుకు ఇంటికి వస్తూనే చీవాట్లు పెట్టింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక చలపతి గుర్రుపెట్టి నిద్రపోయాడు. రఘుపతి మాత్రం నిద్రపట్టకుండా అటూ ఇటూ దొర్లసాగాడు. అంతా గమనిస్తున్న నందయ్య రఘుపతితో, 'చిన్నోడా, అన్న కష్టపడ్డాడు కాబట్టి హాయిగా నిద్రపోతున్నాడు. నువ్వు పని ఎగ్గొట్టి పగలంతా నిద్రపోయి ఉంటావు. కాబట్టే ఇప్పుడు నిద్రపట్టడం లేదు. నువ్వు చాడీలు చెప్పినా తమ్ముడి వన్న ప్రేమతో చలపతి నీ తప్పుని ఉపేక్షించాడు. అవునా?' అని అడిగాడు.

రఘుపతి తను చేసిన పనికి సిగ్గుపడ్డాడు. మంగమ్మ కూడా తన తొందరపాటుకు నొచ్చు కుంది. మర్నాడు అన్నతో సమంగా కష్టపడి రఘుపతి తల్లిదండ్రుల అభిమానానికి పాత్రుడ య్యాడు.

– మల్లారెడ్డి మురళీ మోహన్





# నేను పిసినారినా?

పార్వతి పుట్టింటిలో కొద్ది రోజులు గడిపిన తర్వాత ఒక సాయంత్రం తన ఇంటికి తిరిగొచ్చింది. తలుపు తట్టగానే ఆమె భర్త శివ ఇంట్లోనుండి వచ్చి తలుపు తీశాడు. భర్త తలుపు తీస్తుండగా పార్వతి చూపు ఇంటిముందు అమర్చిన కొత్త కంపెనీ ట్యూబ్‌లైట్ పైకి మళ్ళింది. ముందు నుంచి ఉన్న చిన్న లైటు స్థానంలో కొత్త దాన్ని అమర్చారు. ట్యూబ్ లైట్ చూడగానే పార్వతికి సందేహం ముంచుకొచ్చింది. ఈ కొత్త లైటును ఎందుకోసం అమర్చారు?

తన భర్తపిసినారి అని ఆమెకు తెలుసు. పైసా ఖర్చు పెట్టడానికి అతడు పదిసార్లు ఆలోచిస్తాడు. విద్యుత్తును చాలా పొదుపుగా వాడతాడు. మనం ఆదా చేసిన ప్రతి ఒక్క వాట్ కరెంట్ కూడా ఒక వాట్ కరెంట్ ఉత్పత్తికి సమానమని అతడు నిత్యం చెబుతుంటాడు. అలాంటిది అవసరం లేకున్నప్పటికీ ఇప్పుడు తన భర్త ఇంటి ముంగిట అదనపు లైటు ఎందుకు అమర్చినట్టో ఆమెకు అర్థం కాలేదు.

శివయ్య పిసినారే కావచ్చు. కాని అతడిలో మంచి లక్షణాలు లేవని అర్థం కాదు. స్వతహాగా తను మంచివాడు. భార్య క్షేమ సమాచారాలు అడిగిన తరవాత అతడు నేరుగా విషయంలోకి వచ్చాడు.

'పార్వతీ! నీ మనస్సులో ఏముందో నాకు తెలుసు. ఇంటి ముంగిట కొత్త లైటు అమర్చినందుకు నీకు ఆశ్చర్యం కలిగిందనుకుంటాను. ఇతడి కేమయిందని, ఎందుకిలా చేశాడని నీవు ఆశ్చర్యపడుతుండవచ్చు కూడా. ఎందుకంటే నేను పిసినారిని అనే భావం నీలో బాగా బలపడిపోయింది.' అని శివయ్య నవ్వాడు.

డి. జానకి

'మన ఇంటికి ఎదురుగా అనేక కొత్త ఇళ్లను నిర్మించిన విషయం నీకు తెలుసు కదా! తక్కువ ఆదాయం కలవారికోసం ప్రభుత్వం వీటిని కట్టిస్తోంది. వీరిలో చాలా కుటుంబాలు తమ సామాను తీసుకుని ఈ కొత్త ఇళ్లలో చేరిపోయారు. అయితే, ఈ ఇళ్లకు విద్యుత్ అమర్చడం ఇంకా పూర్తి కాలేదు. అందుకే వాళ్లు రాత్రిపూట చీకటిలో మగ్గుతున్నారు.'

'పరీక్షలు దగ్గిర పడుతుండటంతో ఆ ఇళ్లలో ఉంటున్న పిల్లలకు చాలా కష్టమైపోయింది. మన ఆవరణలో కాస్త వెలుగు వచ్చేలా చేస్తే ఆ పిల్లలు మన వరండాలో కూర్చుని రాత్రిపూట పాఠాలు చదువుకుంటారు కదా అని ఆలోచించాను.'

'అన్ని ధర్మకార్యాలకంటే పిల్లలకు విద్య చెప్పించడమే ఉత్తమోత్తమమైనది. నేను ధనవంతుడిని కాదు. పైగా బోధించడం నాకు చేతకాదు కూడా. కాని చిన్న పిల్లలకు నేను చేస్తున్న ఈ సహాయం ఎంత చిన్నదైనా కావచ్చు నాలో అపరిమిత సంతోషం కలిగిస్తోంది. అదుగో ఆ ఆడుగుల చప్పుడు వింటున్నావా? చీకటి పడుతోంది. పొరుగిళ్లలోని పిల్లలంతా పాఠశాల పుస్తకాలతో సహా మన వరండా వద్దకు వస్తున్నారు. రా. వారిని చూద్దాము.'

శివయ్య తలుపులు తెరిచి భార్యతో పాటుగా బయటకి వచ్చాడు. చిన్న పిల్లలు సంతోషంగా వారిని చూసి కేకలు పెట్టారు. అతడు వారికేసి చూసి నవ్వి, 'పార్వతీ, విద్యుత్తును వృధాచేయడం అంటే నాకు నప్పదు. దేన్నయినా సరే వృధా చేయడం అంటే నాకు గిట్టదు. ఏ ఉత్పత్తి అయినా, ఏ సరుకు అయినా సరే వృధా చేయరాదు. కాని ఇలా అంటున్నానంటే నన్ను పిసినారి కింద లెక్కించవచ్చు అని అర్థం కాదు. ఏదైనా ధర్మ కార్యం కోసం ఖర్చుచేయవలసివస్తే, నేను వెనకాడను. ఇప్పుడు చెప్పు. నేను పిసినారినేనా?'

పార్వతి భర్త వైపు కళ్లెత్తి చూసింది. ఈసారి ఆమె కళల్లో ఆరాధనం, గౌరవం కనిపించాయి.



# ఇచ్చేగుణం

నందగిరి రాజు మహేంద్రుడికి ఒక పర్యాయం తన గురువు వేదనాథుడు జ్ఞప్తికి వచ్చాడు. గురువుగారి బోధన వల్లనే విజయవంతంగా రాజ్యపాలన చేస్తున్నాననే ఎరుక అతనిలో కలిగింది. గురువును సత్కరించడం విధిగా భావించి గురుకులానికి వెళ్ళాడు. తన మనసులోని మాటను చెప్పి, సగౌరవంగా సభకు ఆహ్వానించాడు. శిష్యుని కోరికను వేదనాథుడు కాదనలేకపోయాడు. రాబోయే 'గురుపౌర్ణమి' నాడు వస్తానని మాట ఇచ్చాడు.

చెప్పిన సమయానికి కొందరు శిష్యులతో కలిసి నందగిరి బయలుదేరాడు వేదనాథుడు. వారు వెళ్ళేసరికి చీకటిపడింది. మహేంద్రుడు పట్టపురాణితో కలిసి గురువుకు సాదర స్వాగతం పలికాడు. పాదపూజ అనంతరం వేదనాథుడిని ఉన్నతాసనంపై కూర్చోబెట్టారు.

రాజదంపతులు ఓ భారీ పూలదండను గురువు మెడలో అలంకరించారు. వెనువెంటనే పరివారం తెచ్చిన ఓ పట్టువస్త్రపు మూటను ఆయన చేతిలో ఉంచారు.

'ఏమిటిది' ఆశ్చర్యపోతూ వేదనాథుడు అడిగాడు.

'నా ఉన్నతికి దోహదపడిన మీకు నా గురుదక్షిణ' వినయంతో అన్నాడు మహేంద్రుడు.

'చిరుకానుకే .. దయచేసి స్వీకరించండి' అంటూ మూటవిప్పి చూపింది రాజమహిషి.

బంగారు నాణెములు, వజ్రవైఢూర్యాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయందులో!

ఆ మూటను మహేంద్రునికే తిరిగిస్తూ, 'ఒక గురువుగా 'ఇచ్చే గుణం' తప్ప తీసుకుని ఎరుగను. ప్రజలకోసం ఖర్చుచేసే ప్రతిపైసా గురుదక్షిణగానే భావిస్తాను. నా అంతరంగం నీకు అర్థమైందనే భావిస్తాను,' గంభీరస్వరంతో చెప్పాడు వేదనాథుడు. 'గురుపౌర్ణమి' నాడు గురువు తనకో నూతనపాఠాన్ని బోధించాడని భావించిన మహేంద్రుడు, ఆ సొమ్మును ప్రజల శ్రేయస్సుకే వినియోగించాడు.

– శాఖమూరి శ్రీనివాస్



# ఏది మంచి? ఏది చెడ్డ?

చీనాలో ఒక ముసలివాడు ఉండేవాడు. అతడికొక గుర్రం ఉండేది. ఒకనాడా గుర్రం ఎటో వెళ్లిపోయింది. చుట్టుపక్కలవాళ్లు వచ్చి, గుర్రం పోయినందుకు ముసలివాణ్ణి పరామర్శించారు.

అంతా విని ముసలివాడు, 'ఏమో, ఇదీ ఒకందుకు మేలే కావచ్చు' అన్నాడు. అతడన్నట్టుగానే ఆ పోయిన గుర్రం తిరిగి వస్తూ మరొక కొత్త గుర్రాన్ని వెంట బెట్టుకుని మరీ వచ్చింది.

ఇరుగు పొరుగు వాళ్లు వచ్చి ముసలివాణ్ణి అభినందించారు. కాని ముసలి వాడు, 'ఏమో ఇందువల్ల నాకు నష్టమే కలగవచ్చు,' అన్నాడు.

ఇది జరిగిన కొద్ది రోజుల అనంతరం ముసలివాడి కొడుకు కొత్త గుర్రం ఎక్కి స్వారీ చేస్తూ, పడి కాలు విరగ్గొట్టుకున్నాడు.

మళ్లీ ఇరుగుపొరుగు వాళ్లు వచ్చి ముసలివాడికి సానుభూతి తెలిపారు. ముసలి వాడు అంతా విని 'ఏమో,ఇదీ ఒకందుకు మేలే కావచ్చు,' అన్నాడు.

సరిగ్గా ఆ సమయంలోనే హూణులతో యుద్ధం వచ్చింది. చెయ్యీ కాలూ సరిగా ఉన్నవారి నందరినీ సైన్యంలో చేర్చారు. అందరూ యుద్ధంలో చనిపో యారు. కాలు విరిగిన ముసలివాడి కొడుకు మాత్రం తప్పించుకున్నాడు.





# భయంకర మానవుడు

ఒక నిర్జనమైన అరణ్యంలో అన్ని రకాల మృగాలూ, పక్షులూ, సింహం పరిపాలనలో సుఖంగా జీవిస్తూండేవి. అందులోకి ఎన్నడూ మనుష్యులు అడుగు పెట్టలేదు.

ఆ అరణ్యంలో ఒకనాడు ఒక బాతు నిద్రపోతుండగా ఒక కల వచ్చింది. ఆ కలలో బాతుకు మానవుడు కనిపించి దాన్ని లాలించి దగ్గరకి పిలిచాడు. బాతు మానవుడి దగ్గిరికి పోబోతుండగా ఎవరో దాని చెవిలో పెద్దగా అరిచినట్లయింది.

'ఆ మృగం జోలికి మాత్రం వెళ్లకు. అన్ని మృగాల కన్నా అది క్రూరమైనది!' అనే మాటలు విని బాతు తుళ్లిపడి నిద్ర లేచి ఆ కంగారులో దిక్కు తెలియకుండా అరణ్యంలో పడి పరుగెత్తసాగింది.

పోగాపోగా బాతుకు సింహం ఉండే గుహా, దానిముందు నిలబడి ఉన్న యువరాజూ కనిపించాయి. ఈ యువరాజును తల్లిదండ్రులు గుహదాటి వెళ్లనిచ్చేవారు కారు! అందుచేత దానికి ప్రపంచజ్ఞానం లేదు. అడవిలో ఉండే ఇతర జంతువులే తెలియవు.

ఒక పక్షి కంగారుగా పరిగెత్తుకు వస్తూండటం చూసి యువరాజు, 'ఓ పక్షీ, నీవు ఎవరు? ఏ జాతిదానివి? ఎందుకలా గాభరాగా పరుగెత్తుతున్నావు?' అని అడిగింది.

'మహారాజా, నేను బాతును, బాతుల జాతికి చెందిన దాన్ని. నేను కలలో మానవుడిని చూసి అది మహా భయంకరమైన మృగమనే మాటలు విని భయపడి పారిపోతున్నాను,' అన్నది బాతు.

వై. సోమసుందరం

‘పెర్రిదానా, నేను మృగరాజును ఉండగా నీకే మృగం భయమూ లేదు. ఆ మానవు డిని చీల్చి చెండాడేస్తాను. వెనుక నాకు కూడా ఇలాగే కలలో మానవుడిని గురించి హెచ్చరిక జరిగింది. కాని నాకే ప్రమాదమూ జరగలేదు,’ అంటూ సింహం యువరాజు, బాతు వచ్చినవైపే వేగంగా నడవసాగింది. బాతు గెంతుకుంటూ సింహాన్ని అనుకరిం చింది.

వారు కొంత దూరం వెళ్లేసరికి దూరాన దుమ్ము లేచింది. ‘అదుగో మానవుడు వస్తున్నట్లుంది. నువు దాక్కో. నేను వాడి అంతు తేలుస్తాను,’ అన్నది సింహం.



కాని తీరా దగ్గిరకు వచ్చేసరికి అది ఒక గాడిద. ‘ఎవరు నీవు? నీది ఏ జాతి? ఎందుకలా గాభరాగా పరుగెత్తుతున్నావు?’ అని సింహం గాడిదను అడిగింది.

‘మహారాజా, నేను గాడిదను. మాది గాడిదల జాతి. మానవుడు నన్ను ఏమి హింస పెట్టాడో మీరు ఊహించలేరు. ఎన్ని బరువులు మోశాను! ఎన్నేసి దెబ్బలు తిన్నాను! నా శక్తి ఉడిగిన కొద్దీ దెబ్బలు హెచ్చాయి. తిండి తగ్గింది. ఇక వాడు నన్ను చంపేస్తాడు!’ అన్నది గాడిద.

‘మృగరాజును నేనుండగా నిన్ను ఎవరూ చంపలేరు. కాస్సేపు ఆగి నేను మానవుడిని ఎలా చంపుతానో చూడు,’ అన్నది సింహం రాజసంగా.

‘క్షమించండి, మహారాజా, ఆ మానవుడి కంట పడే ధైర్యం నాకు లేదు,’ అంటూ గాడిద ముందుకు సాగిపోయింది.

మళ్లీ దూరాన దుమ్ము లేచింది. కాని ఈసారి ఒక గుర్రం నురుగులు కక్కుతూ, ఎగరొప్పుతూ అటువైపుకు వచ్చింది. సింహం యువరాజు దాన్ని ఆపి దాని పేరూ, జాతీ, పారిపోతున్న కారణమూ అడిగింది.

‘మహారాజా, మానవుడికి వెరిచి పారి పోతున్నాను,’ అన్నది గుర్రం.

‘ఇంత పెద్ద జంతువు, ఇంత బలం గలదానివి, మానవుడికి భయపడుతు న్నావా? నీకన్న మానవుడికి బలం హెచ్చా?’ అని అడిగింది సింహం.

‘లేకపోతేనేం, మహారాజా? వాడు

క్రూరుడు, ఉపాయశాలి, నాచేత ఇన్నాళ్లూ వెట్టిచాకిరి చేయించుకున్నాడు. నా వీపున ఎక్కి కూచుని, నాకు కళ్లెం తగిలించి, నన్ను కొరడాతో కొట్టి, రికాబు ములుకులతో డొక్కలో పొడిచి వేలాది మైళ్ల దూరం సవారీ చేసి, ముసలిదాన్నయ్యానని నన్ను చంపించి నా చర్మం కాజేయజూస్తున్నాడు!' అన్నది గుర్రం.

సింహం ఎంత ధైర్యం చెప్పినా వినక గుర్రం సాగిపోయింది. తరవాత ఆ దారి వెంట ఒంటె పరిగెత్తుకుంటూ వచ్చింది. అది కూడా మానవుడికి వెరిచే పోతున్నది.

'మిమ్మల్ని అందర్నీ రక్షించే భారం నాది. అందుచేత పారిపోకు. ఇక్కడే ఉండు. నీ వెనుకగా వస్తున్న మానవుడిని ఏం చేస్తానో చూడు,' అన్నది సింహం.

కాని ఒంటె క్షమాపణ చెప్పుకుని మానవుడి కంట బడకుండా ముందుకు సాగిపోయింది. మానవుడిని చూసి పరిగెత్తే ఈ జంతువులకు తనలో ఆపాటి విశ్వాసం లేకపోవటం చూసి సింహం యువరాజు ఆశ్చర్యపడింది.

మరి కాస్సేపట్లో ఒక ముసలి మనిషి అటుగా వచ్చాడు. వాడి నెత్తిన ఒక తట్టా, తట్టలో వడ్రంగపు పనిముట్లూ, తట్టమీద కొన్ని కొయ్య పలకలూ ఉన్నాయి.

వాడు సింహాన్ని చూసి తట్టను దించి సాష్టాంగపడి, 'జయం, జయం మహారాజా! వెయ్యేళ్లు చల్లగా బతకాలి!' అన్నాడు.

శరీరమంతా ముడతలు పడిన ఆ జంతువును చూసి సింహం విరగబడి



నవ్వి, 'నీవు ఎవరు? నీది ఏ జాతి? నీవు కూడా మానవుడికి భయపడే వచ్చేస్తున్నావా?' అని అడిగింది. బాతు వడ్రంగిని చూస్తూనే మూర్ఛపోవడం వల్ల, వాడే మానవుడని సింహానికి చెప్పలేకపోయింది.

'మహారాజా, నేను వడ్రంగిని, వడ్రంగుల జాతివాడిని, ఏలినవారి వద్ద మంత్రిగా ఉండే చిరతపులి తన ఇల్లు జాగ్రత్తగా కట్టిపెట్టమని కబురు పంపితే కట్టడానికి వెళుతున్నాను,' అన్నాడు వడ్రంగి.

'తాహతు ప్రకారం మొదట మాకు కట్టకుండా చిరతపులికి ఇల్లు ఎలా కడతావు? మా ఇల్లు కట్టి మరీ కదులు!' అన్నది సింహం ఆగ్రహిస్తూ.

'ముందు చిరతపులికి ఇల్లు కట్టనివ్వండి, తరవాత తమకు పెద్ద భవంతి కడతాను,' అన్నాడు వడ్రంగి తట్ట నెత్తిన ఎత్తుకుని పోబోతూ.

'వడ్రంగి జాతి జంతువా? నేనెవరో తెలుసా?' అంటూ సింహం తన ముందు కాలి పంజా ఎత్తి విలాసంగా వడ్రంగి రొమ్ము మీద పెట్టి చిన్న తోపు తోసింది. వడ్రంగి ఆ చిన్న తోపుకే వెల్లికిలా పడ్డాడు. వాడి నెత్తిన ఉన్న తట్ట కింద పడి పనిముట్లు చప్పుడు చేశాయి.

'చిత్తం, మీరు కోరినట్టే చేస్తాను,' అంటూ వడ్రంగి ఒక బోను చేసి అందులో సింహం దూరే కంత అమర్చాడు, 'లోపలికి వెళ్ళి చూడండి!' అన్నాడు.

సింహం లోపలికి వెళ్ళగానే వడ్రంగి బోను వాకిలి చప్పున మూసేసి, సింహాన్ని తమ నగరానికి పట్టుకుపోయేందుకు బయలు దేరాడు.

'ఏయ్, వడ్రంగీ? ఏమిటీ పని?' అని సింహం లోపలినుంచి అరిచింది.

'నేనే మానవుణ్ణి! నన్ను చూసి నువు పారిపోవలిసింది!' అంటూ వడ్రంగి పొట్ట చెక్కలయేలా నవ్వాడు.





# మనసులోని మర్మం

ఆరావళి పర్వత ప్రాంతాన్ని ఆనుకుని ఉన్న రాజ్యాన్ని పరిపాలించే విజయ సింహుడికి వివాహమైన చాలా కాలానికి కొడుకు పుట్టాడు. లేకలేక పుట్టిన తమ కుమారుడికి ప్రశంసవర్మ అని నామకరణం చేసి అల్లారు ముద్దుగా పెంచసాగారు అతడి తల్లిదండ్రులు.

ప్రశంసవర్మకు కొంత వయసు వచ్చాక విద్యాభ్యాసం నిమిత్తం గురుకులానికి పంపించారతడి తల్లిదండ్రులు. ఆ గురుకులంలో విద్య నేర్చుకున్న ప్రతి విద్యార్థీ తన భావి జీవితంలో నలుగురి మెప్పూ పొందేవిధంగా రాణించేవాడు.

తమ గురుకులానికి విద్యాభ్యాసం నిమిత్తం వచ్చిన బాలుడు రాజకుమారుడైనా, సామాన్య కుటుంబంలోనుంచి వచ్చిన వాడైనా అందరినీ సమదృష్టితోనే చూసే వాడు ఆ గురుకులాన్ని నిర్వహిస్తున్న సర్వజ్ఞాని.

అంతేకాకుండా ఒక్కో విద్యార్థి మనస్తత్వాన్ని బాగా ఆకళింపు చేసుకుని ఎవరికి తగిన రీతిలో వారికి విద్యగరుపుతూ ఉండేవాడు సర్వజ్ఞాని. తమ తల్లిదండ్రుల దగ్గర ఎంతో మంకుతనం చూపించే విద్యార్థులు కూడా గురుకులానికి వచ్చిన తొలిరోజులలో మారాం చేసినా అనతి కాలంలోనో ఎంతో అణకువగా మారిపోయేవారు.

ఒకరోజు గురుకులంలోని విద్యార్థులకు సర్వజ్ఞాని ఒక పరీక్ష పెట్టాడు. అదేమంటే గురుకులానికి దాపుల ఉన్న అరణ్యంలో సర్వరోగాలనూ నయం చేయగల ఒక అద్భుతమైన మూలిక ఉంది.

ఆ మూలిక ఆటవికుల ఆధీనంలో ఉన్న ఒక గూడెంలో వారు పూజించే కొండ

సీతాసత్య

దేవత పాదాల చెంత ఉన్నది. ఎవరైతే దానిని సంపాదించి తీసుకుని రాగలరో వారు అందరికంటే సమర్థులని సర్వజ్ఞాని భావి స్తాడు.

గురువుగారి ఆశీర్వాదం తీసుకుని విద్యార్థులంతా వెంటనే ప్రయాణమ య్యారు. కాని ప్రశంస వర్మ మాత్రం ఇంకా అక్కడే ఉండిపోయాడు.

సర్వజ్ఞాని అతడిని ఆశ్చర్యంగా చూస్తూ, 'నీకు నీ సమర్థతను నిరూపించుకోవాలని లేదా ఏం?' అన్నాడు.

'లేకేం గురుదేవా.. కాని నేను రాజ కుమారుడిని కదా.. పరీక్షల్లో ఓడిపోయి నట్లయితే నా పరువేం గాను? అందుకే అసలు పరీక్షలోనే పాల్గొనకూడదనుకుం టున్నాను,' అన్నాడు ప్రశంసవర్మ.

సర్వజ్ఞాని చిరునవ్వు నవ్వి, 'నువ్వు రాజకుమారుడివనే విషయం నిజమే, కాని మున్ముందు మహారాజువి కావాలంటే అందుకు కొన్ని అర్హతల్ని కలిగి ఉండాలి. అర్హతలనేవి పుట్టుక వలన రావు. ప్రయత్నం వల్లే లభిస్తాయి,' అన్నాడు.

సర్వజ్ఞాని మాటలు విన్న ప్రశంసవర్మ ఆలస్యం చేయకుండా వెంటనే బయలు దేరాడు. అడవిలో నాలుగు క్రోసుల దూరం ప్రయాణించాక అతడిని ఆటవికులు చుట్టుముట్టారు.

ప్రశంసవర్మ ఎంతగా పోరాడినప్పటికీ ఆ ఆటవికులు ముందు తలవంచక తప్ప లేదు. అతడిని బంధించి తమ నాయకుడి వద్దకు తీసుకుని పోయారు.



ప్రశంసవర్మ పెడరెక్కలు విరిచికట్టి నాయకుడి ముందు నిలబెట్టారు అతడిని బంధించిన ఆటవికులు. నాయకుడు ప్రశంసవర్మ వైపు చూసి, 'ఎవర్నువ్వు?' అని గద్దించాడు. నాయకుడి మాటలకు ప్రశంసవర్మకు అంతులేని కోపం వచ్చింది.

'నా కట్లు విప్పి చూడు. నేనెవరినో నీకు తెలిసేలా చేస్తాను,' అన్నాడు ప్రశంసవర్మ.

అందుకా నాయకుడు కోపం తెచ్చుకో కుండా, 'అదీ చూస్తాను. వీడి కట్లు విప్పం డిరా,' అని ఆదేశించాడు.

మరుక్షణంలో ఆటవికులు ఆతడి బంధనాలు తొలగించారు. వెంటనే ప్రశం సవర్మ నాయకుడి మీదకు లంఘించి అతడి మెడను దొరకబుచ్చుకున్నాడు.

దాంతో ఆటవికులంతా హాహాకారాలు



చేశారు. ప్రశంసవర్మ రెట్టించిన ఉత్సాహంతో ఆటవికుల నాయకుడిని ముప్పుతిప్పలు పెట్టి చివరకు అతడిని చిత్తు చేశాడు.

తమ నాయకుడు బందీ కావడాన్ని సహించలేని ఆటవికులంతా పెద్దగా కేకలు పెడుతూ, ప్రశంసవర్మ మీదకు దాడికి దిగారు.

కానీ ఆటవికుల నాయకుడు వారిని నివారించి, 'ఈ దొర ఎవరో నిజంగానే గొప్ప వీరుడు. ఇటువంటి వీరుడిని మనం సత్క రించాలి గాని శిక్షించ కూడదు,' అన్నాడు.

ప్రశంసవర్మ భుజాలెగరేసి, 'ఇప్పుడైనా తెలిసిందా నేనేమిటో?' అన్నాడు. ఆట వికుల నాయకుడు స్వయంగా తానే ఆ మూలికను తెచ్చి ప్రశంసవర్మకు ఇచ్చి, 'ఇంకేం కావాలో కోరుకో దొరా,' అన్నాడు.

'మా వాళ్లందరినీ విడిచి పెట్టు,' అన్నాడు ప్రశంసవర్మ. ఆటవికుల నాయకుడు ప్రశంసవర్మ సహాధ్యాయులందరినీ బంధ విముక్తులను చేసి, వారందరికీ మర్యాదలు చేసి తర్వాత సగౌరవంగా గురుకులానికి సాగనంపాడు.

అద్భుతమైన మూలికను సంపాదించి తెచ్చినందుకు, సహాధ్యాయులను విడిపిం చుకుని వచ్చినందుకూ, సర్వజ్ఞాని తనను ఎంతో మెచ్చుకుంటాడని భావించాడు ప్రశంసవర్మ.

కానీ అందుకు భిన్నంగా సర్వజ్ఞాని ప్రశంసవర్మ ఇచ్చిన మూలికను అందుకు న్నాడే తప్ప ప్రశంసాపూర్వకంగా ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

తర్వాత కొన్ని రోజులకు రాత్రి వేళల్లో గురుకులం చుట్టూ తిరుగుతూ జింక పిల్లల్ని, కుందేళ్లనూ, పశువులనూ మట్టు పెడుతున్న పులిని సంహరించే బాధ్యతను ప్రశంసవర్మకు అప్పగించాడు సర్వజ్ఞాని.

పులి అడుగు జాడల ఆధారంతో అది ఏయే వేళల్లో ఎక్కడెక్కడ తిరుగుతోందో బాగా ఆకళింపు చేసుకుని మూడు రోజుల్లో దానిని మట్టుబెట్టి చచ్చిన పులిని గురుకు లంలోకి ఈడ్చుకుని వచ్చి సర్వజ్ఞాని ముందు దాన్ని పడేశాడు ప్రశంసవర్మ. ఈసారి కూడా సర్వజ్ఞాని ఏమీ మాట్లాడ లేదు.

చివరకు ప్రశంసవర్మ విద్యాభ్యాసం ముగించి తిరిగి తన రాజ్యానికి వెళ్లే రోజు రానేవచ్చింది. సర్వజ్ఞాని అతడిని దగ్గరకు

పిలిచి, 'ఇంతకాలమూ నేను చెప్పినపనుల్ని నువ్వు ఇతరులందరికంటే సమర్థవంతంగా చేసినప్పటికీ నానుంచి ఎలాంటి ప్రశంసా నీకు లభించనందుకు ఎంత అసంతృప్తి చెందావో నాకు తెలుసు.

నీ విద్యాభ్యాసం పూర్తయినందున చెబుతున్నాను. గుర్తుంచుకో. ఇతరుల నుంచి ప్రశంసలు ఆశించడం అనేది ఒక మానసిక బలహీనత. నువ్వు చేసిన పనిని ఇతరులు మెచ్చుకోవాలని కోరుకుంటున్నావంటే పనికి సంబంధించి ఉండవలసిన స్థాయిలో నీకు ఆత్మవిశ్వాసం లేదని అర్థం. పొగడ్తలను ఆశించడం ఒక మానసిక అవసరంగా భావించినంత కాలమూ ఏ వ్యక్తిలోనూ మానసిక పరమైన ఎదుగుదల ఉండదు.

ఒక గురువుగా నేను నిన్ను పొగిడితే నీ సామర్థ్యం ఇంతే సుమా! అని నేను చెప్పినట్లవుతుంది. అలా కాకుండా నేను మౌనంగా ఉంటే నీ సామర్థ్యానికి ఇది పొగడవలసినంత పని కాదు సుమా! అని చెప్పకనే చెప్పినట్లు నువ్వు భావించి ఉంటే నానుంచి ప్రశంసలు లభించనందుకు నువ్వు ఇంత అసంతృప్తి చెంది ఉండేవాడివి కాదు.

వెళ్లిరా... నా విద్యార్థులందరిలో నువ్వే ఉత్తముడివని ఇప్పుడు చెబుతున్నాను. నువ్వు మహారాజు అయ్యాక... ఆత్మవిశ్వాసంతో నీ శక్తి సామర్థ్యాలను ప్రజల సంక్షేమం కోసం వినియోగించి రాజ్యాన్ని సుభిక్షంగా ఉండేలా జనరంజకంగా పరిపాలించు.

నీ తల్లిదండ్రులు నీకు ప్రశంసవర్మ అని పేరు పెట్టినందుకు ఇతరుల నుంచి ప్రశంసలను ఆశించే బలహీనత నీకు ఉన్నదని ప్రజలు చెప్పుకునే విధంగా గాక నీ రాజ్యంలోని ప్రతి పౌరుడూ నిన్ను వేనోళ్ల పొగుడుతూ మా మహారాజును ఎంత ప్రశంసించినా తక్కువే! ఎందుకంటే అతడు నిజంగా సార్థక నామధేయుడే అనుకునే విధంగా ప్రవర్తించు, శుభం,' అని చేయెత్తి ఆశీర్వదించాడు.





# దృష్టి దోషం

సిరిపురంలో సిద్ధరామయ్య జ్ఞానిగా అందరి గౌరవం పొందాడు. ఒకరోజు ఆయన రచ్చ బండ మీద కూర్చుని చుట్టూ చేరిన కొంత మందితో ఏదో ముచ్చటిస్తుండగా ఒక వ్యక్తి అక్కడికి వచ్చి ఆయనతో, 'నా పేరు గంగ రాజు. మాది ఘనపురం. ఇక్కడికి మకాం మార్చేద్దామని ఉంది. ఈ ఊరి గురించి చెప్పండి,' అన్నాడు.

సిద్ధరామయ్య, 'దానికేం, ముందుగా మీ ఊరును ఎందుకు ఒదిలేయాలనుకుం టున్నావో కాస్త చెబుతావా?' అని అడగ్గా గంగ రాజు 'మా ఊరంతా తుంటరులూ, స్వార్థ పరుల మయంగా ఉంది. అక్కడ ఉండా లంటే కష్టంగా ఉంది' అన్నాడు.

సిద్ధరామయ్య, 'అలాగైతే మా ఊరు మీ ఊరికేమీ తీసిపోదు,' అన్నాడు. గంగరాజు అవాక్కయి 'అలాగా...' అంటూ వెళ్లిపో యాడు.

సిద్ధరామయ్య మాటలకి ఆశ్చర్యపడిన సిరిపురం గ్రామస్థులు 'ఇన్నాళ్లూ మీరేదో అనుకున్నాం. ఈ ఊరిపైనా ఇక్కడి వాళ్లపైనా ఇదా మీ అభిప్రాయం,' అంటూంటే సిద్ధరా మయ్య వాళ్ళతో, 'ఈ గంగరాజు ఈ ఊళ్లో మన మధ్యకి చేరకూడదని అలా అన్నాను కాని మరేమీ కాదు. కారణాలు అడక్కండి, సమయం వస్తే నేనే చెబుతాను,' అన్నాడు.

కొన్నాళ్ళ తర్వాత గంగరాజు మరో వ్యక్తిని వెంటబెట్టుకుని వచ్చి సిద్ధరామయ్యతో, 'ఈ రామరాజు కూడా మా ఊరివాడే, మా ఊరి నుంచి మీ ఊరికి మారిపోవాలను కుంటు న్నాడు. ఈ ఊరి గురించి మీరు నాకు చెప్పి నదంతా విన్నాక కూడా మీతో తానే స్వయంగా మాట్లాడుతానంటే తీసుకుని వచ్చాను,' అన్నాడు.

రామరాజు సిద్ధరామయ్యకి నమస్కరిం చాడు. అతడు 'నువ్వు ఈ ఊరికెందుకు

జొన్నలగడ్డ రత్న

రావడం? మీ ఊళ్లో నీకొచ్చిన కష్టమేమిటి, ఈ ఊరికొస్తే ఒరగబోయేదేమిటి?' అనడిగాడు.

అందుకు రామరాజు వినయంగా, 'మా ఊళ్లో నాకెలాటి ఇబ్బందీ లేదు. అక్కడున్న వాళ్లు సాత్వికులూ, కలుపుగోలు మనుషులూ కారని కూడా అనలేదు. మీ బోటి పెద్దల సాంగత్యం దొరుకుతుందనే ఇక్కడికి రావాలనుకుంటున్నాను,' అన్నాడు.

సిద్ధరామయ్య, 'అయితే నువ్వు భేషుగ్గా మా ఊరికి మకాం మార్చెయ్యెచ్చు. నువ్వె లాంటి మనుషుల మధ్య ఉండాలనుకుంటున్నావో అలాంటి వాళ్లు ఈ ఊరిలో కోకొల్లలుగా ఉన్నారు,' అన్నాడు.

ఆ మాటలకి గంగరాజు విస్తుపోతూ, 'ఈ మధ్యనేగా మీరు నాతో ఈ ఊరి గురించి మరోలా చెప్పారు? ఇంతలోనే మీ ఊరివాళ్ళలో అంత మార్పు వచ్చిందా?' అన్నాడు.

సిద్ధరామయ్య నవ్వి, 'ఈ ప్రపంచం మనం ఎలా చూస్తే అలా కనపడుతుంది. మనకా చూపునిచ్చేది మన మనస్తత్వం కాక మరొకటి కాదు. మీ ఊరివారందరినీ తుంటరులుగా నువ్వు చూస్తుంటే, రామరాజుకు మాత్రం అక్కడ స్నేహపాత్రులే కనపడుతున్నారు. ఈ ఊరికెందుకు రావాలనుకుంటున్నావో నువ్వు కారణం చెప్పినప్పుడే నీకు నీ మనస్తత్వం తెచ్చిపెట్టిన దృష్టి దోషం ఉన్నదని నాకర్థమయ్యింది. ఈ ఊరికి వచ్చాక కూడా నువ్వు ఇక్కడ వాళ్ళందరినీ ఎలా చూడగలవో నేను గ్రహించాను. నీలాంటి వారు మా మధ్యకు రాకూడదని నీకలా చెప్పాను,' అన్నాడు.

ఇది విని గంగరాజు, రామరాజూ, ఇద్దరూ సిద్ధరామయ్యతో, 'ఇక మేము మా ఊరు విడిచి పెట్టి పోవాల్సిన అవసరం లేదనిపిస్తున్నది. మా ఊళ్లోనే ఉండి, మా దృష్టి దోషాలన్నీ పోగొట్టుకుంటూ, అప్పుడప్పుడూ ఇలా వచ్చి మిమ్మల్ని కలుసుకుని మంచి సంగతులు తెలుసుకుంటూ ఉంటాం' అంటూ వెళ్లిపోయారు.

సిద్ధరాయయ్య ఊరివారితో, 'గంగరాజును మన ఊరికి ఎందుకు రావద్దన్నానో అర్థమయిందా, మీలో కూడా ఎవరైనా దృష్టి దోషం ఉన్నవాళ్లుంటే సరిదిద్దుకునే ప్రయత్నం చేయండి,' అనగానే వాళ్లంతా నవ్వుకుంటూ వెళ్లిపోయారు.



# కానుకల మర్మం

**కాం**చనదేశపు రాకుమార్తె శంతనను, వేదాంత దేశ రాకుమారుడు అనంత సేనుడికి ఇచ్చి పెళ్లి చేద్దామని నిశ్చయించుకున్నాడు తండ్రి నాగవర్ధనుడు. ఆమె చిత్రపటాన్ని వేదాంత నగరం పంపించాడు. రాకుమారికి తెలివితేటలుంటేనే పెళ్ళాడతానన్నాడు రాజకుమారుడు.

తర్వాత దూత ద్వారా మోరం గడ్డలు పంపించాడు రాకుమారికి. ఆమె ప్రతిగా మానెడు జొన్నలు మూటగట్టి పంపించింది. వాటిని చూసి, మరుసటి నాడు మానెడు సజ్జలు పంపించాడు. రాకుమారి వాటిని తీసుకుని రెండు మానికల ధాన్యం పంపించింది. రాకుమారుడు ప్రతిగా ఒక కుక్కపిల్లను పంపాడు రాణికి. ఆమె జవాబుగా ఒక కోతిని పంపించింది. దాన్ని చూసిన అనంత సేనుడు 'మహారాణికి కావలసిన అర్హతలన్నీ శంతనకున్నాయి. ఆమెను పెళ్లి చేసుకుంటాను.' అని తండ్రితో చెప్పాడు.

'నువ్వామెకు పంపిన కానుకల్లో అర్థమేమిటో, ఆమె కానుకలతో ఏం సమాధానం చెప్పిందో, నీకు ఎందుకు నచ్చిందో మేము కూడా తెలుసుకుంటే సంతోషిస్తాం గదా!' అన్నాడు తండ్రి. 'వాళ్ల నాగరికత ఏ దశలో ఉందో చూద్దామని, మోరం గడ్డలు పంపాను. మేము వాటిని మానేసి జొన్న రొట్టె తింటున్నాం అని జొన్నలు పంపింది. నేను సజ్జలు పంపాను వండుకుని తినమని. అవి మానేసి సన్న బియ్యం తింటున్నామని, మీకంటే ఒక మెట్టు పైనే ఉన్నామన్నట్లు ధాన్యం పంపింది,' అన్నాడు.

'మరి ఈ కుక్క, కోతి గొడవ ఏమిటి?' అన్నాడు తండ్రి. 'రాకుమారిని ఆట పట్టించడానికి కుక్కపిల్లను పంపాను. దానికి మీరు ఆంజనేయ స్వామి భక్తులు గదా. అందుకే మీకు ప్రియమని కోతిని పంపిస్తున్నానని చెప్పకనే చెప్పింది' అన్నాడు.

'ఇంకేం... అందమూ, తెలివి తేటలు కూడా వచ్చాయి. ఈ రోజే మా వియ్యంకుడికి కబురు పంపిస్తాను,' అన్నాడు రాజు.

– పుప్పాల కృష్ణమూర్తి





# శిథిలాలయం - 26

*(శిథిలాలయ పూజారి, ఇభ్యులను మోసపుచ్చి, ఒక బిలమార్గం ద్వారా పారిపోయాడు. ఇభ్యకుల పెద్ద, తన దళనాయకుడైన నాంగ్‌సోమ్‌ను శిథిలాలయం ఉన్న వృశ్చిక లంకకు దారి చూపేందుకు శిఖిముఖీ వాళ్లతో పంపటానికి ఒప్పుకున్నాడు. రెండు పెద్ద పడవలు సిద్ధం చేయబడినై, అందరూ వృశ్చిక లంకకు ప్రయాణమయ్యారు. తరవాత-)*

సూర్యాస్తమయం వరకూ శిఖిముఖీ వాళ్ళు ప్రయాణం చేసి, ఆ రాత్రికి విడిది చేసేందుకు అనుకూలంగా ఉండే లంక కోసం ప్రయత్నించారు. పావుగంట ప్రయాణ దూరంలో వాళ్లకో లంక కనబడింది. చీకటి పడుతుండగా వాళ్ళా లంక చేరి, పడవలను ఒడ్డునున్న చెట్లకు కట్టి వంట పనులు ప్రారంభించారు. తాము చేసిన మంట నుంచి వెలువడుతున్న పొగను గుర్తించి, మూడవ పడవవాళ్లు కూడా కొంచెం ఆలస్యంగా అక్కడికీ రాగలరని వాళ్లు భావించారు.

క్రమంగా చీకటి కమ్ముకున్నది. వంట పూర్తి కాగానే అందరూ భోజనాలు చేసి, నెగడొకటి వెలిగించి, దాని చుట్టూ కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. మూడవ పడవ ఇంకా ఆ లంక చేరలేదు. శిఖిముఖీ, శిథిలాలయ పూజారి తమ కన్న ముందుగా వృశ్చిక లంకకు ప్రయాణం కట్టాడని గట్టి నమ్మకం కలిగింది. ఒకవేళ తమ పడవలూ, వాడున్న పడవా ఎక్కడో మార్గమధ్యాన తారసపడితే, పోరు తప్పదు. అప్పుడు తమలో కొందరైనా జలజంతువులకు ఆహారం అయిపోతారు.

దాసరి సుబ్రహ్మణ్యం



ఇలా ఆలోచిస్తున్న శిఖిముఖికి లంక మీది చెట్లలో నీటిపక్షులు చేసే కలకలంతో పాటు తీరం వెంట నీటిలో మొసళ్లూ ఇతర జంతువులూ చేసే ధ్వనులూ కూడా విని పిస్తున్నవి. అతడు విక్రమకేసరితో, 'ఈ చీకట్లో, ఈ లంకా, చుట్టూ వాతావరణం ఎంత భయంకరంగా ఉన్నదో చూశావా? దీనికన్న క్రూరమృగాల నడుమ మహా రణ్యంలో కాలం గడపడం వేయింతలు సుఖంగా ఉంటుంది,' అన్నాడు.

నాంగ్‌సోమ్ అవునన్నట్లు తలూపాడు. విక్రమకేసరి, 'నువ్వీ లంకను గురించి ఆలోచిస్తున్నావా? నాకు పూజారి గుర్తు కొస్తున్నాడు. వాడీ లంకలోనే మరో ప్రాంతాన బస చేశాడేమో అన్న అనుమానం నాకు కలుగుతున్నది,' అన్నాడు. ఆ మాటలకు శిఖిముఖి నవ్వి, పక్కనున్న ఎండుకట్టెలు నెగడులో వేయసాగాడు. ఉన్నట్లుండి హఠాత్తుగా లంకలో ఒక మూలనుంచి గుండెలవిసే లాంటి కేక ఒకటి వినిపిం చింది. ఎర్రగండు అటుకేసి తిరిగి మొరగ సాగింది. శిఖిముఖి చప్పున లేచి నిలబడి, 'అది మనిషి గొంతా లేక ఏదైనా వింత మృగానిదా?' అన్నాడు.

'ఎవరో మనిషి ప్రమాదంలో చిక్కుకు న్నాడు. లేక మనను ప్రమాదంలో చిక్కిం చేందుకు శిథిలాలయ పూజారి ఎత్తు వేస్తూండవచ్చు. ఆయుధాలు సిద్ధంగా పట్టుకుని బయలుదేరండి,' అన్నాడు విక్రమకేసరి.

అజిత, వీరభద్రులు చప్పున రెండు కాగడాలు వెలిగించి ముందు బయలు దేరారు. ఈసారి ఎవడో మనిషి అరుస్తున్న ట్లుగా స్పష్టంగా కేకలు వినిపించినై. అందరూ అక్కడికి పరిగెత్తేసరికి, కుంటి కాలువాడొకడు అటూ ఇటూ గెంతుతూ, చేతిలో ఉన్న దుడ్డుకర్ర సాయంతో, తన మీదికి ఉరుకుతున్న రెండు మొసళ్లతో పోరాడుతున్నాడు.

శిఖిముఖి ఆ కుంటివాడి రక్షణకు ముందుకురికే లోపలే ఎర్రగండు భయం కరంగా మొరిగి వాడి మీదికి లంఘిం చింది. కుక్క అరుపు వింటూనే కుంటి వాడు వణికిపోతూ, 'శిఖి దొరా! నన్ను

ముందు మొసళ్లనుంచి కాదు, ఈ ఎర్ర గండు నుంచి కాపాడండి! తరవాత మీ ఇష్టం వచ్చిన శిక్ష విధించండి!' అన్నాడు.

ఆ కంఠస్వరం విని అందరూ ఆ కుంటివాడు తమకు ద్రోహం చేసి పారిపోయిన జాంగ్‌లా అని గుర్తించారు. ఎంత దుర్మార్గుణ్ణయినా చిత్రహింసలకు గురిచేయడం మానవత్వం అనిపించుకోదు గనక, శిఖిముఖి ముందుగా ఎర్రగండును దగ్గిరకు పిలిచి, తన చేతి కత్తితో ఒక మొసలిని తలమీద గట్టిగా కొట్టాడు. ఇంతలో అజితుడు ఈటెతో రెండవ మొసలిని నడుం మీద పొడిచాడు.



మొసళ్లు రెండూ తాము దెబ్బతిన్న దెబ్బల కన్నా కాగడాల వెలుగుకు ఎక్కువగా భయపడిపోయి, దాపులనున్న నీటికేసి చరచరా పాకి, దభీమంటూ అందులో పడినై. జాంగ్‌లా ఆయసపడుతూ నేల మీద కూలబడ్డాడు. అతడేదో చెప్పాలని చూశాడు గాని, నోటి మాట పెగలలేదు.

శిఖిముఖీ అతడి మిత్రులూ హఠాత్తుగా ఎదురైన ఈ వింత సంఘటనకు ఆశ్చర్యపడ్డారు. జాంగ్‌లా ఈ రాత్రివేళ ఈ లంకకు ఎలా చేరుకున్నాడో వాళ్ళు ఊహించలేకపోయారు. శిథిలాలయ పూజారి తమ మీదవేగు చేసేందుకు జాంగ్‌లాను తాము దిగిన చోటుకు పంపాడేమో అన్న అనుమానం మాత్రం విక్రమకేసరికి కలిగింది.

శిఖిముఖి, జాంగ్‌లాను ఏదో ప్రశ్నించబోయేంతలో, విక్రమకేసరి కత్తి ఎత్తి, 'జాంగ్‌లా! నిజం చెప్పు. అబద్ధం ఆడావో రెండో కాలు కూడా నరికి ప్రాణం ఉండగానే నిన్ను మొసళ్ల దగ్గిరకు తోయించుతాను. నీ యజమాని ఆ పూజారిగాడు ఈ లంకలో ఏ మూల దిగాడు?' అని ప్రశ్నించాడు.

జాంగ్‌లా ఆ ప్రశ్నకు భయపడినట్లు లేదు. అతడు బతుకు మీద రోసినవాడిలా ఒక నిట్టూర్పు విడిచి, 'కేసరి దొరా! నేను మీకు చేసిన ద్రోహానికి, ఇప్పుడు నేనెంత నిజం చెప్పినా నమ్మరు. నాకు మీ ఇష్టం వచ్చిన శిక్ష విధించండి,' అన్నాడు.

'ఈ దొంగ నాటకం నా దగ్గర సాగదు. నిజం చెబుతావా లేదా?' అంటూ విక్రమకేసరి కత్తిని జాంగ్‌లా మెడమీద పెట్టాడు.



శిఖిముఖి నవ్వుతూ, 'కేసరీ, అప్పుడే నీ ప్రతిజ్ఞ మాట మరిచిపోయి వాడి తల నరకబోతున్నావు. ప్రాణాలతో గదా వాణ్ణి మొసళ్లకు వేస్తానని నీ వింతకు ముందు అన్నది? కొంచెం ఆగు.. జాంగ్‌లా! ఇప్పటి నీ పరిస్థితి చూస్తుంటే నువ్వు సుఖమైన చావుకోసం ఎదురుచూస్తున్నట్లు కనబడుతున్నావు. కాని నిజం చెప్పకపోతే కేసరి నిన్ను ప్రాణాలతోనే మొసళ్లకు వేసి భయంకరమైన చావుకు నిన్ను గురిచేస్తాడు. తెలిసిందా?' అన్నాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం మౌనంగా ఊరుకుని, 'శిఖిదొరా! ద్రోహి చచ్చేముందు నిజం పలికినా, అబద్ధం మాట్లాడినా ఒకటే. కాని చావుకు ముందు నేను చెప్పే నిజం మీకు కొంత ఉపకరిస్తుంది, పూజారి ఈ రోజు మధ్యాహ్నం ప్రాంతాలే రెండు పడవల్లో శిథిలాలయం ఉన్న లంకకేసి పోయాడు. మీరా లంక చేరే సమయానికి వాడు మీ కోసం మాటువేసి ఉంటాడు. మీరు తగు జాగ్రత్తలో ఉండండి,' అన్నాడు.

జాంగ్‌లా మాటల్లో మోసం లేదన్న నమ్మకం శిఖిముఖికి కలిగింది. 'అయితే, జాంగ్‌లా, నువ్వు నీ యజమానితో వెళ్లక ఈ మొసళ్ల లంకమీద ఎందుకు దిగబడిపోయావు?' అని ప్రశ్నించాడు.

'చచ్చేముందైనా నిజం చెప్పి చావదలిచాను. దొరా! వినండి. నేను మీకు తల పెట్టిన ద్రోహం వల్లే చిరుతపులికి చిక్కి ఆవిటివాణ్ణయిపోయాను. నా పాపమే నన్నణిచింది. కామాఖ్య నగరంలో గౌరవంగా బతికే నన్ను, డబ్బాశ చూపి దుర్మార్మ్రుడిగా చేసినవాడు పూజారి. వాణ్ణే సమయం వచ్చినప్పుడు హతమార్చదలిచాను. కాని వాడు నీచగ్రహోపాసకుడు. నా ఆలోచనలు పసిగట్టాడో ఏమో నన్ను ఏదో భయంకరమైన జలజంతువుకు ఆహారంగావేసి పోజూసాడు,' అన్నాడు జాంగ్‌లా.

'నిన్ను జలజంతువుకు ఆహారంగా వేశాడా! అదెలా జరిగింది?' అన్నాడు శిఖిముఖి ఆశ్చర్యపడుతూ.

జాంగ్‌లా ఇలా చెప్పాడు.

'గోల్‌భరా గ్రామప్రాంతంలోని నది దగ్గర్నించి ఈ జలప్రదేశానికి వాడి పడవలు

సాగినప్పటి నుంచీ, నేను చుట్టుపక్కల ఉన్న అన్ని లంకల్నీ పరిశీలించి చూస్తూ, ఒక్కొక్కదాన్నే గుర్తుపెట్టుకోసాగాను. నేను గజ ఈతగాడిని, ఆ పూజారిని వాడి ముఠాతో పాటు ఏదో ఒక చోట పడవలతో నీటముంచి, ఏ తెప్పకొయ్య మీదో తిరిగి గోల్‌భరా చేరాలన్నది నా పథకం.

వాడు నా ఆలోచనలు గ్రహించినట్టున్నాడు. ఈ మధ్యాహ్నం పడవలు ఈ లంక పక్క నుంచి పోతుండగా, వాడు పడవ మీంచి నీట్లోకి తొంగి చూసి, 'ఆహా శిథిలేశ్వరి కంఠాభరణం అయిన మహా జల సర్పం దర్శనమిచ్చిందా? ప్రసాదం సమర్పించాలా? తప్పక సమర్పిస్తాను! ఆ ఒక్క సజీవ ప్రసాదాన్ని స్వీకరించి మా అందరికీ ఏ హానీ కలగకుండా శిథిలేశ్వరీ ఆలయానికి చేర్చు,' అంటూ కళ్లు మూసుకుని ఉష్ణీషాన్ని ఎగరవేశాడు. అది గురిగా వచ్చి నా తలమీదపడింది. వెంటనే వాడు, 'ఓహో ఎంత అదృష్టం నీది, జాంగ్‌లా! శిథిలేశ్వరి సేవికకు ఆహారమై, వచ్చే జన్మలో ఇభ్యాజాతికంతకూ నాయకుడివిగా జన్మించబోతున్నావు!' అన్నాడు.

'ఆ దుర్మార్గుడు ఏం చేయబోతున్నాడో నేను ఊహించేలోపలే వాడు సవర భేరుండానికి సైగ చేశాడు. భేరుండం ఒక్క దూకున వచ్చి పడవమీంచి నన్ను నీటిలోకి గిరవాటు వేశాడు. నేను మునిగిపోయినట్లు నటించి, నీటి అడుగునే ఈదుకుంటూ దాపుల



ఉన్న ఈ లంక చేరాను. ఆకలితో, బడలికతో సగం చచ్చిన నా మీద ఇంతకు ముందు మొసళ్లు వచ్చి పడినై. మీరు రక్షించారు. ఇదీ నా కథ!'

శిఖిముఖి కొంచెం సేపు ఆలోచించి, 'కేసరీ! నీ అభిప్రాయం ఏమిటి? జాంగ్‌లా చెప్పింది నమ్మటమా, మానటమా?' అని అడిగాడు. 'అతడు నమ్మదగిన విధంగా కథ చెప్పాడు!' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఆ మాటలకు నవ్వి, అజిత వీరభద్రుల్నీ నాంగ్‌సోమ్‌నూ ప్రశ్నించాడు. వాళ్లు జాంగ్‌లా చెప్పింది నిజంలా కనబడుతున్నదన్నారు.

'అయితే మనం ఉదయం బయలుదేరి పోయేటప్పుడు జాంగ్‌లాను వెంట



తీసుకుపోదాం. ఏమంటావ్ కేసరీ?' అని అడిగాడు శిఖిముఖి.

'తప్పకుండా మన పడవల్లో తీసుకు పోదాం, మళ్ళీ ఏదైనా ద్రోహం తలపెట్టే సూచనలు కనబడితే, ఈసారి ఏ మాత్రం అవకాశం ఇవ్వకుండా కత్తులతో ముక్కలు ముక్కలుగా నరుకుదాం,' అన్నాడు విక్ర మకేసరి.

అందరూ అక్కణ్ణుంచి కదిలి, తాము విడిది దిగిన చోటుకు బయలుదేరగానే జాంగ్‌లా, శిఖిముకి, విక్రమకేసరుల పాదా లను తాకి వారి వెనకగా కర్రసాయంతో కుంటుతూ నడిచాడు.

సూర్యోదయంతోనే అందరూ నిద్రమే ల్కొని, కాలకృత్యాలు తీర్చుకుని పడవ లను ప్రయాణానికి సిద్ధపరిచారు. జాంగ్ లాను శిఖిముఖీ ,విక్రమకేసరీ ఉన్న పడవ లోకి ఎక్కించారు. అవసరం అయినప్పుడు తెడ్లు వేయడానికి అతడు వీరభద్రుడికి సాయంగా ఉండగలడని శిఖిముఖి అలా చేశాడు. వాళ్లు లంక నుంచి బయలు దేరుతూ, మరికొందరు ఇభ్యులతో కొంచె వెనకగా ప్రయాణం కట్టిన పడవకోసం చుట్టుపక్కల అంతా పరీక్షించి చూశారు. పడవ జాడ లేదు బహుశా పడవలోని వాళ్లు దారి తప్పారేమో అన్న అనుమానం శిఖి ముఖికి, విక్రమకేసరికీ కలిగింది.

గాలివాలు బాగా ఉండటంతో తెడ్లు వేయడం మాని పడవలకు తెరచాపలె త్తారు. నాంగ్‌సోమ్ అజితుడూ ఉన్న పడవ ముందుకు పోసాగింది. మధ్యాహ్నం భోజ నాల వేళ సమయంలో, ఏ లంక మీద దిగి వంటలు చేసుకుందామా అని శిఖిముఖీ వాళ్ళు ఆలోచిస్తుండగా, ఒక లంక మలు పులో నుంచి నీరు అల్లకల్లోలమవుతూ, వాళ్ల పడవలకేసి రాసాగింది.అప్పటి వరకూ ప్రశాంతగా ఉన్న నీటి మీద అంతలేసి అలలు ఎందుకు లేస్తున్నవో ఎవరికీ అర్థం కాలేదు.

నాంగ్‌సోమ్ తన పడవను దాపునవున్న లంక కేసి తెడ్లసాయంతో మళ్లిస్తూ, శిఖి ముఖీ వాళ్లను కూడా హెచ్చరించాడు. అంతలో లంక మలువు తిరిగిన చోటు నుంచి హఠాత్తుగా రెండు పడవలు అలల

తాకిడికి కిందుమీదులవుతూ వాళ్ళకేసి కొట్టుకురాసాగినై.

ఆ పడవలలో ఉన్నవాళ్లను శిఖిముఖీ విక్రమకేసరీ వెంటనే గుర్తించగలిగారు. ఒక పడవలో ఉన్న శిథిలాలయ పూజారి చేతులెత్తి పెద్దగా అరుస్తూ, 'జలసర్పం మనను మింగజూస్తున్నది! పడవల్ని లంకకు పట్టించండి!' అంటున్నాడు.

చూస్తుండగానే పూజారి చెప్పే ఆ జలసర్పం కూడా శిఖిముఖి వాళ్ళ కంటబడింది. ఆ సర్పం మెడా, తలా మాత్రం పాముకు ఉన్నట్లు ఉన్నది. కాని శరీరం మటుకు పదీ పన్నెండు ఏనుగుల పరిమాణంలో లావుగా ఉన్నది. అది తన కాళ్లతో నీటిని అల్లకల్లోలపరుస్తూ, పూజారి పడవలలో ఉన్న వాళ్ళను పట్టుకునేందుకు తల కిందికీ పైకీ తిప్పుతున్నది.

ఆ దృశ్యం చూసి శిఖిముఖితో పాటు అందరూ వణికిపోయారు. అదృష్టవశాత్తూ వాళ్ళ పడవలు లంకకు సమీపాన ఉండటంతో, అతి త్వరలోనే వాళ్లు తీరాన్ని చేరుకోగలిగారు. శిథిలాలయ పూజారి వాళ్ల పడవలు మాత్రం జలజంతువు వల్ల లేచిన అలలలో చిక్కుకుని కిందుమీదులవుతూ నీటివెంట కొట్టుకు పోసాగినై.

ఒడ్డు చేరిన శిఖిముఖీ వాళ్లు చూస్తుండగానే జలజంతువు పూజారి ఉన్న పడవలోకి తలపెట్టి ఒకణ్ణి నోట కరుచుకున్నది. పూజారీ, అతడి వెంట ఉన్నవాళ్లూ పిచ్చిగా అరుస్తూ పడవలను తెడ్ల సహాయంతో దూరంగా నడపసాగారు. జలజంతువు తాను పట్టినవాణ్ణి మింగేందుకు ఓ క్షణకాలం ఆగి తిరిగి వాటి వెంటపడింది.

'శిఖీ! పనిలో పని, ఆ పూజారి దుర్మార్గుడు నా బాణం దెబ్బకు అందుతాడేమో చూస్తాను!' అంటూ విక్రమకేసరి పూజారి ఉన్న పడవ కేసి గురిగా బాణాలు వదలసాగాడు. (ఇంకా ఉంది)



# మెలకువ

కూరగాయల ధరలు మండిపోతున్నాయి. ఈ వ్యాపారం చేయడం కష్టమే,' అంటూ కూలబడిపోయాడు కూరగాయలు అమ్మే సూరయ్య.

'నువ్వు అలా అంటే ఎలా? అలవాటు పడ్డ వ్యాపారం తెలివిగా మసలుకొని అమ్మకాలు కొనసాగించడమే మంచిది. కొత్త వ్యాపారమైతే అలవాటు పడ్డవరకు దినదిన గండమే,' అంటూ భర్తను ఉత్సాహపరచసాగింది భార్య రత్నాలు.

'నువ్వు అలా అంటున్నావు గాని గంట నుండి కిలో నలభై, కిలో నలభై అంటున్నా కొనేవారి సంఖ్య అంతంత మాత్రంగానే ఉంది,' ఉసూరుమంటూ చెప్పాడు సూరయ్య.

'కొద్ది సేపు నువ్వు విశ్రాంతి తీసుకో, నేను అమ్మిపెడతా ఈ కూరగాయాలు,' అంటూ భరోసా ఇచ్చింది రత్నాలు.

సూరయ్య నిద్రకు ఉపక్రమించాడు. గంటపోయాక లేచి చూశాడు. కూరగాయలన్నీ అమ్ముడైపోయాయి, 'నష్టానికి అమ్మేశావా?' అనుమానంగా అడిగాడు.

'లేదు. నువ్వు చెప్పే రేటుకే అమ్మాను. నా తెలివికి పదును బెట్టి పావుకేజీ పది పావుకేజీ పది అని అరిచాను. నలభై రూపాయల దగ్గర పదిరూపాయలు తక్కువగా అనిపించడంతో బరువు విషయం మరిచి కావల్సినవి కొన్నారు,' అసలు విషయం చెప్పింది రత్నాలు.

భార్య తెలివికి మెచ్చుకుని ఆ రోజునుండి భార్య చెప్పిన మెలకువతో వ్యాపారం చేస్తూ నిశ్చింతగా ఉన్నాడు సూరయ్య. – బి.వి.పట్నాయక్





# గుడ్డి దర్బారు

పూర్వం హైదరాబాదు నగరం సమీపంలో షకురా అనే పేదవాడొకడు ఉండేవాడు. వాడు నవాబుల ఆస్థానంలో ఏ కొద్ది పాటి ఉద్యోగమైనా సంపాదించి, కనీసం నెలకు రెండు రూపాయల జీతమైనా తీసి, దానితో పొట్టపోసుకుగడుపుదామని రాజధానికి వచ్చాడు. ఆ కాలంలో రెండు రూపాయల నెలజీతం కూడా బతుకుతెరువు మాదిరి గానే ఉండేది.

అయితే షకురా ఎంత ప్రయత్నించినా ఏమీ లాభం లేకపోయింది. వాడు ఎన్ని అర్జీలు పెట్టుకున్నా, సహాయపడే నాధుడు లేనందున, అన్నీ బుట్టదాఖలయ్యాయి.

చివరకు షకురా సాహసించి ఒక పని చేశాడు.వాడు ఒక కంసాలి సహాయంతో ఒక మొహరు చేయించుకున్నాడు. అది పట్టుకుని ప్రధాన న్యాయస్థానం వెలుపల ఒకచోట కూచుని, తన ముందు ఒక బల్ల పెట్టుకున్నాడు. లోపలికి అర్జీలు పట్టుకు వెళ్లే వారినందరినీ పిలిచి వాళ్ల అర్జీల పైన ఆ మొహరుతో ముద్రవేసి, అర్జీకి ఒక పైస చొప్పున వసూలు చేయసాగాడు. ఇదంతా ప్రభుత్వం చేసిన ఏర్పాటే కాబోలునను కుని అర్జీదార్లు తమ అర్జీలపై మొహరు ముద్ర వేయించుకుని ఆ తరువాతనే తమ కాగితాలను అధికార్లకు దాఖలు చేసుకో సాగారు. త్వరలోనే ఇది పరిపాటి అయిపో యింది. న్యాయస్థానోద్యోగులు కూడా ఈ ముద్రకు అలవాటైపోయారు. కాని ఆ ముద్ర ఎందుకు ఉన్నదీ, ఎవరు వేస్తు న్నదీ, ఏ అధికారంతో వేస్తున్నదీ ఆలోచిం చినవారు లేరు.

షకురా కొద్దికాలంలోనే బోలెడంత సంపాదన సంపాదించుకున్నాడు. తన

జి. సత్య జగన్నాథరావు

రహస్యం బయటపడిపోతే నవాబు తన తల తీయిస్తాడని వాడికి భయం పట్టుకున్నది. అందుకు వాడొక ఉపాయం చేశాడు. తాను వేసే ముద్రలకు ఒక పైసా వసూలు చేయడానికి బదులు రెండేసి వసూలు చేసి,అందులో ఒకటి తాను తీసుకుని, రెండవది నిలవవేసి ఉంచసాగాడు.

ఇలా పది సంవత్సరాలు గడిచినాక ఒక నాడు ఏ కారణంచేతనో షకురా కచేరీకి వెళ్లలేకపోయాడు. ఆనాడు వచ్చిన అర్జీల పైన మొహరు ముద్ర లేదు. 'వీటిపైన ముద్ర లేదు. ఇవి చెల్లవు,' అన్నారు గుమాస్తాలు. ఈ వ్యవహారం పెద్ద అధికార్ల దాకా వెళ్లింది. వాళ్లు 'అసలు ఈ ముద్ర ఏమిటి, దీన్ని ఎవరు వేస్తున్నారు?' అని ఆరా తీశారు.

పాత అర్జీలు తెప్పించి ఆ ముద్రను పరీక్షిస్తే అందులో ఇలా ఉంది. అంధే సర్కార్–షీతల్ దర్వాజా–షకురా మొహర్. అది సర్కారు మొహరు కానేకాదు. ఈ సంగతి నవాబుదాకా వెళ్లింది. షకురాను పట్టి తీసుకురమ్మని ఆయన ఆజ్ఞాపించాడు. భటులు షకురాను తెచ్చి నవాబు ఎదుట హాజరుపెట్టారు. ఇలా ఎప్పటికైనా జరుగుతుందని వాడు అనుకుంటూనే ఉన్నాడు. కనక వాడు తాను పోగు చేసి ఉంచిన పైకం వెంటబెట్టుకుని నవాబు వద్దకు వెళ్ళాడు.

నవాబు వాణ్ణి, 'ఎవరు నీవు? ఈ మొహరు నీదేనా? ఎవరు నీకు అధికారం ఇచ్చారు?' అని అడగవలసిన ప్రశ్నలన్నీ అడిగాడు. షకురా దాచకుండా జరిగినదంతా నవాబుకు విన్నవించి, 'తమ వంతు ఇప్పటికీ ముప్పైవేలు వసూలయింది. ఇదుగో ఆ డబ్బు!' అని చెప్పాడు.

వాడి చాకచక్యానికి నవాబు సంతోషించి, వాడికి ఆ పనే ఒక ఉద్యోగంగా ఖాయం చేసి, మొహరులో ఉన్న అంధే సర్కారు అన్న మాటలలో సర్కారు అనేది మాత్రం ఉంచి, అంధే అనే మాట చెక్కించేశాడు.

షకురా మొహరు చాలాకాలం అమలులో ఉంది.



# దాంభికుడు

ఒక పేదవాడు అడవికి పోయి కట్టెలు కొట్టి, వాటిని మోపు కట్టి, వీపున వేసుకుని బస్తీలో అమ్ముకోవటానికి వచ్చాడు.

బస్తీ వీధిలో జనం జాస్తిగా ఉన్నారు. పేదవాడి వీపున ఉన్న కట్టెలు బారు జాస్తిగా ఉన్నాయి. అందుచేత వాడు గొంతెత్తి 'తొలగండి, బాబూ! తొలగండి!' అని కేకలు పెడుతూ వీధి వెంట నడిచాడు.

వాడి కేక విని జనం తప్పుకుంటూ వచ్చారు. కాని ఒక దాంభికుడు పక్కకు తొలగ లేదు. అతని బట్టలు కట్టెలకు పట్టుకుని చిరిగాయి. దాంభికుడికి మండిపో యింది. అతను ఆ పేదవాణ్ణి న్యాయాధికారి వద్దకు లాక్కుపోయి, వాడు తన బట్టలు చించాడని ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి పేదవాణ్ణి ఎన్నో ప్రశ్నలు వేశాడు. కాని పేదవాడు తల వంచుకుని బెల్లం కొట్టిన రాయిలాగా ఉండిపోయాడు. చివరకు న్యాయాధికారి విసిగి, 'ఈ మూగ వెధవను నా దగ్గిరికి తెచ్చారేమిటి?' అని దాంభికుణ్ణి అడిగాడు. 'అయ్యా, వీడిప్పుడు దొంగవేషం వేస్తున్నాడు. వీధిలో నడిచేటప్పుడు, తొలగండి, బాబూ, తొలగండి, అని వీడు గావుకేకలు పెట్టటం నేను చెవులారా విన్నాను,' అన్నాను దాంభికుడు.

'అలాగా? వాడి కేకలు విని కూడా తొలగకపోవడం మీదే తప్పు. మీ ఫిర్యాదు కొట్టేస్తున్నాను,' అన్నాడు న్యాయాధికారి.





# అప్పు తెచ్చిన ముప్పు

శ్రీపురం అనే గ్రామంలో నారాయణ, రామ్మూర్తి అనే ఇద్దరు మిత్రులు ఉండే వారు. ఇద్దరిదీ వ్యవసాయమే.

రామ్మూర్తికి పదెకరాల పొలం ఉంటే, నారాయణకు ఉన్నది ఐదు ఎకరాలే. ఆర్థికంగా కూడా నారాయణ కంటే రామ్మూర్తి పరిస్థితే మెరుగ్గా ఉండేది.

పట్టణం నుండి షాహుకార్లు శ్రీపురం వచ్చి రైతులకు, ఇతరులకు సొమ్ములు అప్పులిచ్చేవారు. కొందరికైతే అడక్కుండానే మొహమాటపెట్టి మరీ ఇచ్చేవారు.

కొందరి వద్ద పొలాలు స్థిరాస్తులూ తాకట్టు పెట్టుకుంటే, మరి కొందరి వద్ద తెల్లకాగితాల పైన సంతకాలు తీసుకునే వారు. వడ్డీ అధికమైనా, సునాయాసంగా అప్పు లభిస్తున్నందున నిస్సంకోచంగా తీసుకునేవారంతా.

నిజానికి రామ్మూర్తికి అప్పు చేసి వ్యవసాయం చేయవలసిన ఆగత్యం లేదు. ఐనా స్వంత సొమ్మును ఖర్చుచేయకుండా అప్పు చేసి వ్యవసాయం చేసేవాడు. వచ్చిన పంటను చీకటి బజారులో విక్రయించి బాగా సొమ్ము చేసుకునేవాడు.

నారాయణకు మాత్రం అప్పు చేయడం సుతరామూ ఇష్టం ఉండేది కాదు. ఉన్న సొమ్ముతోనే విత్తనాలు, ఎరువులు, పురుగుల మందులు కొనుక్కుని.. చాలినంత మేరకే పొలం సాగు చేసుకునేవాడు. అవసరమైతే భార్య మెళ్లో నగను అమ్మేసేవాడు. పంట చేతికి వచ్చాక మళ్లీ చేయించి ఇచ్చేవాడు. అందువల్ల ఉన్నది ఐదెకరాలైనా అందులో సగం కంటే ఎక్కువ సాగు చేసుకోలేకపోయేవాడు. దాంతో కుటుంబం గడపడం గగనమైపోయేది.

తిరుమలశ్రీ



మిత్రుడి అవస్థ చూసిన రామ్మూర్తి, నారాయణను కూడా షాహుకార్ల వద్ద రుణాలు తీసుకుని పొలమంతా పండించుకోమని ఒత్తిడి చేసేవాడు. అప్పు చేసేందుకు ఇష్టపడని నారాయణ మాత్రం ససేమిరా అనేవాడు.

నారాయణ భార్య సీతాలక్ష్మికి భర్త వరుస నచ్చేది కాదు. 'చాలీ చాలని సొమ్ముతో ఎదుగూ బొదుగూ లేని వ్యవసాయం ఏం చేస్తావు? లోకంలో అప్పు చేయనివాడు ఎవడు? ఆ రామ్మూర్తిని చూసైనా నేర్చుకో,' అంటూ సాధించేది.

'అప్పు, నిప్పు, తప్పు – ఈ మూడూ మనిషికి కష్టాలు తెచ్చిపెట్టేవే. ఏ కారణంగానైనా రుణం తీర్చలేకపోతే అది వెన్ను మీద రణమై కూర్చుంటుంది. అనాలోచితంగా నిప్పును తాకితే చేయి కాలుతుంది. అలాగే ఒకసారి తప్పు చేస్తే అది జీవితాంతమూ బాధిస్తూనే ఉంటుంది. వీలైనంత మటుకు వాటికి దూరంగా ఉండటం ఉత్తమం. అప్పుచేసి పప్పుకూడు తినే కంటే, కష్టించి కలో గంజో తాగి పరువుగా బతకడం మేలు. ప్రశాంతంగా నిద్రించగలుగుతాం,' అంటూ భార్యను సమాధానపర్చడానికి ప్రయత్నించేవాడు నారాయణ. సీతాలక్ష్మి అతడిని వెర్రివాడిలా చూసేది.

వరుసగా రెండేళ్లపాటు పంటలు పండకపోవడమో, పండిన పంట నాశనం కావడమో జరిగింది. రైతులందరూ కష్టాలలో పడ్డారు. భూకామందులు తట్టుకోగలిగినా, సన్నకారు రైతుల గతి దుర్భరమైంది. దేశంలో తిండి గింజలకు, పప్పు దినుసులకు, కరువు ఏర్పడింది.

'పట్నం షాహుకార్లతో చెప్పి అప్పు ఇప్పిస్తాను. మళ్లీ విత్తనాలు కొని సాగుబడికి పూనుకో,' అని సలహా ఇచ్చాడు రామ్మూర్తి, నారాయణకు. సీతాలక్ష్మి కూడా అదేమాట అంది. కాని, అప్పు చేయడానికి అంగీరించలేదు నారాయణ. 'అవసరమైతే కూలో నాలో ఐనా చేస్తాను కాని అప్పు మాత్రం చేయను,' అన్నాడు. భర్తపైన అలిగి పుట్టింటికి వెళ్లిపోయింది సీతాలక్ష్మి.

ఒక రోజు ప్రభుత్వాధికారులు కొందరు హఠాత్తుగా రామ్మూర్తి ఇంటిపైన దాడి చేసి, అతను చీకటి బజారులో విక్రయించడానికి దాచి ఉంచిన ధాన్యం, పప్పు దినుసులు కనిపెట్టి స్వాధీనం చేసుకున్నారు. విపరీ

త్మైన జుల్మానా కూడా విధించారు. దాంతో ఉన్న సొమ్ము ఊడ్చి పెట్టి జరిమానా కట్టేసి, శిక్షనుండి తప్పించుకోగలిగాడు రామ్మూర్తి. ఇంతలో రైతులకు అప్పులిచ్చిన షాహు కార్లు గ్రామం మీద పడి రెండు మూడే ళ్లుగా తమ బాకీలు తీర్చడం లేదన్న మిషతో.. రైతుల పొలాలను, స్థలాలను, ఇతర స్థిరాస్థులను జప్తు చేసేసుకున్నారు.

అంతవరకు పిలిచి మరీ రుణాలు ఇచ్చిన షాహుకార్లు ఇప్పుడు బాకీ చెల్లించ డానికి రామ్మూర్తికి గడువు ఇవ్వడానికి కూడా ఇష్టపడలేదు. అతని పొలమూ, ఇల్లూ స్వాధీనం చేసేసుకున్నారు.

విషయం ఆలకించిన నారాయణ మిక్కిలి విచారించి మిత్రుడిని పరామర్శిం చడానికి వెళ్లాడు. 'నేను మొదటినుండీ చెబుతూనే ఉన్నాను. అవసరం ఉన్నా లేకపోయినా అప్పులు చేస్తే ఇలా పరాభ వానికి గురికాక తప్పదు. అప్పుకు తోడు, చీకటి బజారులో ప్రవేశించి నువ్వు తప్పు కూడా చేశావు. నిప్పును తాకకముందే తెలుసుకోవాలి అది కాలుతుందని, చేయి కాలిందని ఆనక మొత్తుకుని ప్రయోజనం ఏమిటి?' అన్నాడు సన్నగా మందలిస్తూ. మిత్రుడి పలుకులలోని సత్యాన్ని గుర్తిం చిన రామ్మూర్తి పశ్చాత్తాపానికి గురయ్యాడు.

నారాయణ జాలిపడి, 'జరిగిందేదో జరిగిపోయింది. నువ్వు ఆర్థికంగా కోలు కునేంతవరకు నా భార్య నగలు అమ్మి నా పొలంలో ఉమ్మడి వ్యవసాయం చేద్దాం. దిగుబడిని చెరిసగం పంచుకుందాం,' అన్నాడు స్నేహితుడిని ఓదార్చుతూ.

మిత్రుడి మంచితనానికి కన్నులు చెమ్మ గిలడంతో అతన్ని ఆలింగనం చేసుకు న్నాడు రామ్మూర్తి. గ్రామంలో జరిగిన సంఘటనలను గురించి ఆలకించిన సీతా లక్ష్మి నిర్ఘాంతపోయింది. భర్త ఔన్నత్యం గుర్తింపుకు రావడంతో వెంటనే ఇంటికి తిరిగి వచ్చింది.

తన అవివేకాన్ని క్షమించమంటూ కోరిన భార్యను ప్రేమతో అక్కున చేర్చుకున్నాడు నారాయణ.





# అట్టమీది బొమ్మ

ఒరిస్సాలోని పూరీ జగన్నాథ ఆలయం హిందూస్తాన్ లోని నాలుగు ప్రసిద్ధ దేవాలయాల్లో ఒకటి.

నీలాద్రి అటవీప్రాంతంలో ఒక సవర తెగ నాయకుడు నీలమాధవుడి రూపంలో ఉన్న దేవుడిని రహస్యంగా పూజించేవాడు. ఆ కాలంలోనే ఇంద్రద్యుమ్నుడు అవంతీ చక్రవర్తిగా ఉండేవాడు. ఇతడు విష్ణు భక్తుడు. దేవుడు తన సంపూర్ణ రూపంలో ఉత్కళ ప్రాంతంలో కనిపిస్తాడని అతడు కలగని ఆ ప్రాంతాన్ని వెతికేందుకోసం విద్యాపతిని పంపించాడు. ఆ రహస్య ప్రాంతాన్ని బయట పెట్టేందుకు సవర తెగ నేత తిరస్కరించాడు. విద్యావతి చివరికి ఆ రహస్యాన్ని ఛేదించి చక్రవర్తికి సమాచారం పంపాడు. అయితే ఆ గుహ వద్దకు రాజు చేరుకునేసరికి నీల మాధవుడి విగ్రహం మాయమైపోయింది. విచారపడ్డ రాజు మళ్లీ తాను అశ్వమేథ యాగం నిర్వహిస్తున్నట్లు, తీరప్రాంతంలో ఒక కొయ్య దుంగను కనుగొన్నట్లు, దానిపై బొమ్మ చిత్రించగలుగుతున్నట్టు కలగన్నాడు. అలా యాగం చేశాక అతడు తీరప్రాంతంలో కొయ్య దుంగ నీటిపై తేలియాడుతుండటం చూశాడు. దేవ శిల్పి విశ్వకర్మ ముదుసలిగా వచ్చి తాను శిల్పం చెక్కుతానని చెప్పాడు. ఇంటిలోపల 21 రోజులపాటు ఉండి తాను పనిచేసేందుకు అనుమతి పొందాడు. ఆ గదిలో కొయ్య దుంగ మాత్రమే ఉంటుంది. పనిచేస్తున్న రోజుల్లో ఎవరూ అతడికి అంతరాయం కలిగించకూడదు. అలా తొలి రెండువారాలపాటు సుత్తితో చెక్కుతున్నట్లు తప్ప మరే శబ్దం వినిపించలేదు. తర్వాత గదినుంచి ఎలాంటి శబ్దాలు రాలేదు. రాణి గుండిచ, ఇంద్రద్యుమ్నుడు ఆ గది తలుపులు తెరిపించారు. అక్కడ శిల్పి లేడు. పూర్తి కాని మూడు శిల్పాలు అక్కడే ఉన్నాయి. అసంపూర్తి శిల్పాలను చూస్తూనే, రాజు గుండె పగిలింది. అశరీరవాణి తమ కోసం అక్కడే ఆలయం నిర్మించి వాటిని తన ప్రతిరూపాలుగా ఎంచి పూజించాలని కోరింది. ప్రస్తుతం పూరీలో ఉన్న దేవాలయం క్రీ.శ. 12వ శతాబ్దంలో స్థాపించబడింది. రాణి తలుపులు తెరిపించగా విశ్వకర్మ మాయమైపోయిన దృశ్యాన్నే మీరు ఈనెల చందమామ ముఖ చిత్రంగా చూస్తున్నారు. చందమామ చిత్రబ్రహ్మ శ్రీ వపా 1990లో దీనిని చిత్రించారు. ఇది ఆ ఏడు మే సంచికలో ప్రచురితమైంది. ఈ చక్కటి చిత్రాన్ని మీరు ఆస్వాదించగలరని ఆశిస్తున్నాము. వచ్చే నెల మరో చక్కటి వర్ణచిత్ర ముఖపత్రంతో కలుసుకుందాము.

– సౌమ్యా భరద్వాజ్

# కెరీర్ అంటే?

పాటలు పాడటం అనేది అలవాటు. అదేసమయంలో అది వృత్తి కూడా. ఇటీవలి కాలంలో సంగీతం విస్తృతమైన గుర్తింపుకు నోచుకుంది. ఇది నిజంగానే ఒక ఆసక్తికరమైన కెరీర్.

మానవులు సాధించిన ప్రగాఢమైన అంశాలలో సంగీతం ఒకటి. ఇది భావోద్వేగాలను రూపొందించగల, అనుభూతులను వ్యక్తీకరించగల సార్వజనీన శబ్దం. సంగీతం మనస్సును కూడా రంజింపజేస్తుంది.



సంగీతంలో శాస్త్రీయ, జానపద,జాజ్, పాప్, మిశ్రమ వంటి పలు రకాల రూపాలున్నాయి. సంగీత ప్రదర్శనకారులుగా, లేదా సంగీత బోధకులుగా మారటంతో పాటు కంపోజర్/పాటల రచయిత, సంగీత ప్రచురణకర్త, సంగీత జర్నలిస్టు, డిస్క్ జాకీ/వీడియో జాకీ లేదా మ్యూజిక్ థెరపిస్ట్ వంటి పలు రకాల వృత్తులను ఈ రంగంలో చేపట్టవచ్చు. దూరదర్శన్, ఆకాశవాణి, ప్రైవేట్ ఎఫ్ఎమ్ ఛానెల్ స్టేషన్లు, ప్రభుత్వ సాంస్కృతిక శాఖలు, ప్రజాసంబంధాల శాఖలు, సంగీత శోధనా సంస్థలు, విద్యా సంస్థలు, కళాకేంద్రాలు మొదలైనవి ఎక్కువగా ఉద్యోగావశాలను కల్పిస్తున్నాయి. దిన, వార, మాసపత్రికలకు కూడా సంగీత విమర్శకులు, కరెస్పాండెంట్లు అవసరం. ఇంకా ఇంట్లోనే సంగీతంపై ప్రైవేట్ క్లాసులు నిర్వహించుకోవచ్చు, సంగీత పాఠశాలను ప్రారంభించవచ్చు లేదా స్వతంత్రంగానే సంగీత కార్యక్రమాలను రూపొందించి, నిర్వహించవచ్చు. టీవీ వ్యాప్తి, పెరుగుతున్న సంగీత ఛానెళ్ల ప్రాచుర్యం, కార్పొరేట్ స్పాన్సర్‌షిప్ వంటివి సంగీతాన్ని అతి పెద్ద వ్యాపారంగా మార్చివేశాయి.



సంగీత పరిశ్రమ నుంచి అనేక కెరీర్‌లను ఎంచుకోవచ్చు. వీటిలో కొన్ని:
1. మ్యూజిక్ కంపోజర్లు/పాట రచయితలు 2. గాయకులు/ప్రదర్శకులు 3. నిర్మాతలు 4.ఆర్టిస్ట్/సంగీత నిర్వహణ 5. మ్యూజిక్ జర్నలిస్ట్ 6.మ్యూజిక్ ఎడ్యుకేటర్/టీచర్ 7. మ్యూజిక్‌థెరపిస్ట్ 8. మ్యూజికాలజిస్ట్ 9. వీడియో జాకీలు (విజెలు) – డిస్క్ జాకీలు (డిజెలు) 10. మ్యూజిక్ లైబ్రేరియన్.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 40

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

*Co-sponsored by* Infosys *FOUNDATION, Bangalore*

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -40 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూన్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. ఆగస్టు 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారతీయ ఆవిష్కరణలు



1. సున్న సంఖ్యను కనుగొన్నది ఎవరు?
2. మొట్టమొదటి కంటి శస్త్రచికిత్సను చేసినదెవరు?
3. త్రికోణమితి విధులను కనుగొన్నది ఎవరు?
4. మొక్కలలో పెరుగుదలను కొలిచే పరికరం కనిపెట్టినది ఎవరు?
5. మొట్టమొదటి సారిగా చదరంగం కనుగొన్నది ఎవరు?
6. ప్రపంచంలో మొట్టమొదటి విశ్వవిద్యాలయం ఎక్కడ స్థాపించారు?
7. పైథాగరస్ థీరమ్‌ను క్రీ. పూ. 800 సంవత్సరంలో కనుగొన్నది ఎవరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-37 సమాధానాలు:

1. స్ట్రాబెర్రీ; 2. కివి; 3. అరటిపండు; 4. మామిడి; 5. బేరిపండు; 6. మ్యాంగోస్టీన్ పండు; 7. విటమిన్ సి; 8. పండ్ల చక్కెర.

*ఫిబ్రవరి '12 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.*



# నవ్వుల పువ్వులు



టీచర్ : పప్పూ, 'నా కుక్క' అనే అంశంపై నీ కాంపోజిషన్ సరిగ్గా మీ అన్న రాసిన దానిలాగే ఉంది. దాన్ని నువ్వు మక్కీగా దింపేశావా?

పప్పు : లేదు టీచర్, మేమిద్దరం రాసింది ఒకే కుక్కపైనే మరి.



రాము : మా చరిత్ర మాస్టారు పరిశోధన కోసం ఇంటర్నెట్‌ని ఉపయోగించాలని సూచించారు, నిజంగానే అది చాలా సహాయకారిగా ఉంది.

సోము : నిజంగానా?

రాము : అవును! నేను ఇప్పటికే పరిశోధనా పత్రాలను అమ్ముతున్న 17మంది వ్యక్తులను గుర్తించాను మరి!

ఒక కళాశాల విద్యార్థికి తన షెడ్యూల్‌ను భర్తీ చేసుకోవడానికి రెండు గంటల కోర్సు అవసరమైంది. అతడికి వన్యప్రాణుల అధ్యయన శాస్త్రం మాత్రమే లభించింది.

ఒక వారం తర్వాత, ఒక పరీక్ష పెట్టారు. ప్రొఫెసర్ నాలుగు సమాన భాగాలుగా విభజించిన ఒక కాగితం ముక్కను విద్యార్థులకు అందించారు. ప్రతి కాగితం ముక్కలో పక్షుల కాళ్లను నైపుణ్యంతో చిత్రించారు. మిగతా పక్షి ఆకారం కాని, పాదాలు కాని లేకుండా కేవలం కాళ్లు మాత్రమే ఆ బొమ్మలలో ఉన్నాయి. బొమ్మల లోని కాళ్ల ఆధారంగా పక్షులను గుర్తించడమే పరీక్ష. మన విద్యార్థి కూర్చుని పరీక్ష పత్రంకేసి చూసినప్పుడల్లా ఆగ్రహంతో ఊగిపోసాగాడు. చివరకు, అతడు తరగతి గది ముందుకు వచ్చి పరీక్షా పత్రాన్ని టీచర్ డెస్క్ మీదికి విసిరేశాడు. 'నేను రాసిన అతి చెత్త పరీక్షల్లో ఇదొకటి' అన్నాడు. టీచర్ అతడికేసి చూసి, 'అబ్బాయీ, నీవు పరీక్షలో ఫెయిలయ్యావు, నీ పేరేమిటి?' అనడిగాడు. ఆ అబ్బాయి వెంటనే అతడి కాలిపైభాగం వరకు తన ప్యాంట్‌ను పైకెత్తి తన కాళ్లను టీచర్‌కి చూపిస్తూ అన్నాడు. 'నా పేరేంటో మీరే చెప్పండి చూద్దాం!'



# డౌనట్‌ల వింత గాథ





డౌనట్‌లు(వడలు) అంటే అమాంతంగా చెవి కోసుకునే అడ్మిరల్ రిచ్చర్డ్ బైర్డ్, దక్షిణ ధృవ యాత్రలో భాగంగా రెండేళ్లకు సరిప డేలా 1600 ఔన్సుల డౌనట్ పిండిని తనతోపాటు తీసుకెళ్లాడు.



డౌనట్లకు తమదైన ప్రత్యేక దినం కూడా ఉంది. అమెరికాలో జూలై తొలివారంలో నేషనల్ డౌనట్ డేని వైభవంగా జరుపుకుంటారు. ప్రపంచయుద్ధకాలంలో సైనికులకు డౌనట్లను అందించే సాల్వేషన్ ఆర్మీ అవసరాలకోసం 1938లో ఈ ఉత్సవాలను ప్రారంభించారు. ఈ రోజున, అమెరికాలో చాలా అంగళ్లు ప్రజలకు ఉచితంగా డౌన ట్లను అందిస్తాయి.



మొదటి ప్రపంచయుద్ధకాలంలో, అమెరికన్ సేనలను సంతోష పెట్టడానికి పలువురు వలంటీర్లు వడలను తయారుచేసి వడ్డిం చారు. ఇది ప్రారంభమైన తొలి రోజునుంచి డౌనట్లు పెద్ద విజయం సాధించాయి. తమ వంతు డౌనట్ తీసుకోవడానికి భారీ సంఖ్యలో సైనికులు టెంట్ వద్ద నిలబడి ఓపిగ్గా వేచి చేసేవారట. తొలి రోజు 150 డౌనట్లు తయారు చేయగా, తర్వాతి రోజునుంచి దాదాపు 9000 డౌనట్లు తయారు చేసేవారట.




డౌనట్లు అన్నిటికీ మధ్యలో రంధ్రాలు ఉండవు. పోలెండ్‌లో పక్జ్‌కి అనేవి సాంప్రదాయిక డౌనట్‌లు. కార్నివాల్ ఉత్సవాలలో ఫ్యాట్ ట్యూస్ డే లేదా మార్డి గ్రాస్ రోజుల్లో వీటిని ఆరగించేవారు. ఆ రోజు డౌనట్‌లు ఎందుకు ప్రీతిపాత్రమయ్యేవంటే లెంట్ పండుగ కోసం సాంప్రదాయికంగా కొవ్వు ఉన్న, బలవర్ధకమైన ఆహారాన్ని ఆరగించేవారు. పక్జికి డౌనట్‌లో పాలు, గుడ్లు, పిండి, చక్కెర మరియు క్రీమ్ లేదా జెల్లీ ఉంటాయి!



ఒలియెబొల్లెన్ మరొక రంధ్రాలు లేని డౌనట్‌కు ప్రామాణిక ఉదాహరణ. వీటిని డిసెంబర్ 26 మరియు జనవరి 6తేదీల మధ్యకాలంలో నెదర్లాండ్స్‌లో జర్మనీ తెగల ప్రజలు తొలుత ఆరగించేవారు. దుష్టశక్తులతో కలిసి పర్చ్‌టా దేవత ఈరోజుల్లో ఆకాశంలో విహరిస్తుంటారని తమకు ఎదురుగా వచ్చిన వారి పొట్టలను వారు కత్తులతో కోస్తారని వీరి నమ్మకం. కాని ఒలిబొల్లెన్ అనే పేరుగల డౌనట్‌లో నూనె, కొవ్వు ఉన్నందువల్ల, వాటిని తిన్న వారి శరీరంపై కత్తులు దిగకుండా జారిపోతాయని వీరి నమ్మకం. ఏం తర్కమో మరి!



వసంతకాలంలో పళ్లతోట నుండి తీసుకున్న గుండ్రటి తాజా ఆపిల్ ముక్కలను తినడం కంటే మించినది ఏముంటుంది? సైడర్ డౌనట్‌లు! ఆపిల్ సైడర్‌లు తీపి లేని, ఆపిల్‌లను వడపోత పోయని రకం ఆపిల్ జ్యూస్‌ని కలిగి ఉంటాయి. సైడర్ డౌనట్‌లు సైడర్ మిల్స్ నుంచి అమ్మబడతాయి. ఇవి తీయగాను, ఘాటుగానూ ఉంటాయి.



బెర్లిన్ వాసులు జామ్ లేదా జెల్లీతో నింపబడిన డౌనట్‌లను ఆరగిస్తారు. జర్మనీలోని కొన్ని ప్రాంతాల్లో వీటిని ఫాన్‌కుచెన్ అని అంటారు. నూతన సంవత్సర సంబరాలలో మరియు మార్డి గ్రాస్ ఉత్సవాల్లోనూ వీటిని ఆరగిస్తారు. జామ్‌కు బదులుగా ఆవాలను నింపిన డౌనట్లను బెర్లిన్ వాసులకు ఇస్తుంటారని ఈ సందర్భంగా సాధారణ జోక్ ఒకటి వాడుకలో ఉంటోంది.



దక్షిణ కొరియాలోని బేకరీలు గులాబీ, ఆకుపచ్చ, తెలుపు రంగులలో వివిధ రకాల డౌనట్‌లను తయారు చేస్తుంటాయి. ఆవిరిలో ఉడికించబడిన జిగటగా ఉండే వరి పిండి మరియు తీపి ఎరుపు రంగు బీన్స్ గింజల ముద్ద లేదా నువ్వులను వాడి వీటిని చేస్తుంటారు.



వడ మరియు బాదుషా అనేవి మనవైన డౌనట్‌లు. ఒకటి ఘాటుగా ఉంటే, మరొకటి తీయగా ఉంటాయి. దక్షిణ భారతదేశంలో రోడ్డు పక్క చిల్లర దుకాణాల నుండి హోటళ్లవరకు వడ వివిధరూపాలలో లభ్యమవుతుంటుంది. బంగ్లాదేశ్ తరచుగా మెరిసే డౌనట్‌లకు మారుపేరుగా పేరొందింది.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి.
ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల
ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Only two days. | How is the preparation? |
| --- | --- | --- |
| Telugu | రెండు రోజులు మాత్రమే. | సన్నాహం ఎలా ఉంది? |
| Hindi | केवल दो दिन।<br>కేవల్ దో దిన్. | तैयारी कैसी है?<br>తైయారీ కైసీ హై? |
| Tamil | இரண்டு நாட்கள் தான்!<br>ఇరండు నాట్కళ్ థాన్! | நீ எப்படி படித்திருக்கிறாய்?<br>నీ ఎప్పుడి పడిత్తురుక్కిరాయ్? |
| Bengali | মাত্র দুই দিন।<br>మాత్రో దుయి ధిన్. | প্রস্তুতি কেমন হয়ছে?<br>ప్రోస్తుతి కెమోన్ హొచ్ఛే? |
| Marathi | फक्त दोन दिवस.<br>ఫక్త్ దొన్ దివస్. | पूर्वतयारी कशी झाली आहे?<br>పుర్వతయారి కషి జాలి ఆహె? |
| Kannada | ಎರಡು ದಿನ ಮಾತ್ರ.<br>ఎరడు దిన మాత్ర. | ತಯಾರಿ ಹೇಗೆ ನಡೆದಿದೆ?<br>తయారి హేగె నడెదిదె? |
| Oriya | କେବଳ ଦୁଇ ଦିନ।<br>కెబల దుయి దిన. | ପ୍ରସ୍ତୁତି କିପରି ଅଛି?<br>ప్రస్తుతి కిపరి అచ్ఛి? |
| Gujarati | ફક્ત બે દિવસ.<br>ఫక్త్ బి దివస్. | તૈયારી કેવી છે?<br>తైయారీ కేవి చ్ఛే? |
| Assamese | কেৱল দুদিন।<br>కేవల్ దుదిన్. | প্ৰস্তুতি কেনে?<br>ప్రస్తుతి కెనె? |
| Malayalam | രണ്ടു ദിവസം മാത്രം.<br>రండు దివసమ్ మాత్రమ్. | ഒരുക്കങ്ങൾ എങ്ങനെയുണ്ട്?<br>ఒరుక్కంగల్ ఎంగన ఉండు? |
| Santali | ᱠᱷᱟᱹᱞᱤ ᱵᱟᱨ ᱫᱤᱱ ᱥᱩᱢᱩᱝ।<br>ఖాలి బర్ దిన్ సుముంగ్. | ᱪᱮᱫ ᱞᱮᱠᱟᱢ ᱥᱟᱯᱲᱟᱣ ᱟᱠᱟᱱᱟ?<br>చెద్ లెకమ్ సప్డావ్ అకన? |
| Sanskrit | केवलं दिनद्वयम्।<br>కేవలమ్ దినద్వయమ్. | सिद्धता कथं प्रचलति?<br>సిద్ధతా కథమ్ ప్రచలతి? |





| English | It was very easy. | It was very difficult. |
|---|---|---|
| Telugu | చాలా సులభం. | చాలా కష్టం. |
| Hindi | वह बहुत आसान था।<br>వహ్ బహుత్ అసాన్ థా. | वह बहुत कठिन था।<br>వహ్ బహుత్ కఠిన్ థా. |
| Tamil | அது மிகவும் சுலபம்.<br>అదు మికవుమ్ సులభమ్. | அது மிகவும் கஷ்டம்.<br>అదు మికవుమ్ కష్టమ్. |
| Bengali | সেটা খুব সহজ ছিল।<br>సెటా ఖుబ్ సహొజ్ చ్చిలో. | সেটা খুব শক্ত ছিল।<br>సెటా ఖుబ్ షక్తో చిలో. |
| Marathi | ते खूप सोपं होतं.<br>టె ఖూప్ సోపా హొతం. | ते खूपच कठीण होतं.<br>టె ఖోపచ్ కథిన్ హొతం. |
| Kannada | ಅದು ತುಂಬಾ ಸುಲಭ ಇತ್ತು.<br>అదు తుంబా సులభ ఇత్తు. | ಅದು ತುಂಬಾ ಕಷ್ಟ ಇತ್ತು.<br>అదు తుంబా కష్ట ఇత్తు. |
| Oriya | ଏହା ଭାରି ସହଜ ଥିଲା॥<br>ఏహా భారి సహజ థిలా. | ଏହା ଭାରି କଠିନ ଥିଲା॥<br>ఏహా భారి కఠిన థిలా. |
| Gujarati | તે ખૂબ સહેલું હતું.<br>తె ఖోబ సహెల్ను హటు. | તે ખૂબ મુશ્કેલ હતું.<br>తె ఖోబ్ ముష్కెల హటు. |
| Assamese | এইটো একেবাৰে সহজ আছিল।<br>ఐతు ఎకెబరె జహాస్ ఆసిల్. | এইটো বৰ কঠিন আছিল।<br>ఐతు బొర్ కఠిన్ ఆసిల్. |
| Malayalam | അത് വളരെ എളുപ്പമായിരുന്നു.<br>అథు వలర ఎలుప్పమయిరున్ను. | അത് വളരെ പ്രയാസമായിരുന്നു.<br>అథు వలర ప్రయాసమయిరున్ను. |
| Santali | ᱱᱚᱣᱟ ᱟᱰᱤ ᱟᱞᱜᱟ ᱛᱟᱦᱮᱸᱱᱟ।<br>నొవ అడి అల్గ తహెంన్య. | ᱱᱚᱣᱟ ᱟᱰᱤ ᱟᱸᱴ ᱛᱟᱦᱮᱸᱱᱟ।<br>నొవ అడి అంట్ తహెంన్య. |
| Sanskrit | तत् अतिसुलभम् आसीत्।<br>తత్ అతిసులభమ్ ఆసీత్. | तत् अतिकठिनम् आसीत्।<br>తత్ అతికఠినమ్ ఆసీత్. |

## మహా ఏనుగులు – మిరపకాయ వైద్యం



అస్సాంలో అడవులు చాలావరకు నరికివేయబడుతుండటంతో ఏనుగుల మందలు గ్రామాల్లోకి చొరబడసాగాయి. గ్రామస్తులు తమ్ముతాము కాపాడుకోవడానికి తమకు తోచిన ప్రయత్నమల్లా చేయనారంభించారు. అస్సాం అటవీ శాఖ దీనికి సంబంధించి, పరిష్కారం కనిపెట్టింది. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అస్సాం మిరపకాయను ఉపయోగించి ఏనుగులను చెదరగొట్టాలని అస్సాం అటవీశాఖ భావించింది. ఈ మిరపకాయ ప్రపంచంలోనే అత్యంత కారంగా ఉండే మిరపకాయ. ఈ మిరపకాయ నుంచి తీసిన ముద్దకు ప్రత్యేకమైన కందెన కలిపితే ఇది ఏనుగులు లోపలకి రాకుండా నిరోధిస్తుందని అటవీ శాఖ చెప్పింది. ఊరి పొలిమేర చుట్టూ తాళ్లు కట్టి ఈ ముద్దను వాటికి పూస్తారు. అంత పెద్ద ఏనుగులు కూడా దీన్ని దాటి రాలేవు. దీంట్లో రహస్యమేమిటంటే ఈ మిరపకాయం చాలా ఘాటైనది. మందపు చర్మం కలిగిన ఏనుగులలాంటి భారీ జంతువులు కూడా దీని ఘాటు తగిలితే చాలు ఒళ్లు మండుతున్నట్లయి వెంటనే ఆవతలకు వెళతాయి.

చివరకు వరల్డ్‌వైడ్ ఫండ్ ఆఫ్ నేచర్ సంస్థ కూడా ఈ పథకానికి మద్దతిచ్చింది.అస్సాంలోని ఏనుగులు చాలా ఎక్కువగా ఉంటున్న సోనాయ్–రుపయ్ వన్యప్రాణి సంరక్షణ కేంద్రానికి దగ్గరగా ఉన్న ఉత్తర అస్సాంలోని కొన్ని గ్రామాలలో ఈ పథకాన్ని ఇప్పటికే ప్రారంభించారు.

## పిల్లల పంచాయితీ

కొత్త ఢిల్లీలోని విశాలమైన మురికివాడ గోవిందపురి. 9కి.మీ. పొడవైన ఈ మురికివాడకు ప్రత్యేకత ఉంది. ఇక్కడి పిల్లలు బాల పంచాయితీలను నెలకొల్పారు. పిల్లలు బడికి వెళ్లకుండా నిలిచి పోవడం, పరీక్షల్లో కొంతమంది తప్పిపోవడం వంటి అంశాలపై వీరు పంచాయితీ నిర్వహిస్తుంటారు. క్షయవ్యాధిపై లఘుచిత్రాలు తీయడం, మట్టి బొమ్మలు, ప్లాస్టిక్ మోడలింగ్‌పై ఆర్ట్ వర్క్‌షాపులలో పాల్గొనడం, బొమ్మల తయారీ, లోహాలను అచ్చు వేయడం, సైనికుల కుటుంబాల సహాయార్థం వీధి నాటకాలు వేయడం వంటి కార్యక్రమాల్లో వీరు పాల్గొంటారు. పంచాయితీలలో తమను ఇబ్బంది పెడుతున్న సమస్యల పరిష్కారానికి ప్రయత్నిస్తారు. కమ్యూనిటీ ఎయిడ్ స్పాన్సర్‌షిప్ ప్రోగ్రామ్ అనే ప్రభుత్వేతర సంస్థ(సిఎఎస్‌పి) పంచాయితీని నెలకొల్పేలా పిల్లలను ప్రేరేపించింది. యునైటెడ్ స్టేట్స్ ఏజెన్సీ ఫర్ ఇంటర్నేషనల్ డెవలపింగ్ మరియు మెకార్థర్ ఫౌండేషన్ అనే రెండు అంతర్జాతీయ సంస్థలు ఈ పథకాన్ని కొనసాగించడంలో సిఎఎస్‌పికి సహాయపడుతున్నాయి.

## విదూషకుడు

## బీర్బల్



# రాజు ఎవరు?



1. పర్షియా చక్రవర్తి ఒకసారి బీర్బల్ ఘనత గురించి విని అతడిని తన ఆస్థానానికి ఆహ్వానించాడు. బీర్బల్‌కి రాజమందిరంలో ఘన సత్కారం లభించింది.



2. బీర్బల్ గందరగోళానికి గురయ్యాడు. తన ఎదురుగా అందరూ ఒకే దుస్తులు ధరించారు. వారు అధివశించిన ఆసనాలు కూడా రాజ సింహాసనం లాగా ఉన్నాయి.



3. బీర్బల్ చుట్టూ చూశాడు. 'వీరిలో ఎవరు చక్రవర్తి?' అంటూ ఆశ్చర్యపోయాడు. 'బహుశా వీరు నన్ను పరీక్షించదలిచారు కాబోలు!'



4. బీర్బల్ వారి ముఖాలను పట్టి పట్టి చూశాడు. 'వీరిలో ఒకరు తప్పనిసరిగా రాజై ఉంటారు. కాని, ఎవరు?'



5. బీర్బల్ కాస్సేపు వారి కదలికలను గమనించాడు. చివరికి వారిలో రాజు ఎవరో గుర్తించడంతో అతడి ముఖంలో చిరునవ్వు తాండవించింది.



6. బీర్బల్ అతడివైపు నడిచి మూడుసార్లు సలాములు చేశాడు. 'జహాపనా మీకు ప్రణామాలు!'



7. రాజు ఆశ్చర్యపోయాడు. 'నన్ను ఎలా గుర్తు పట్టావు బీర్బల్!' అని అడిగాడు.



8. 'చాలా సులభం ప్రభూ, వీరిలో ప్రతి ఒక్కరూ మీలాగే దుస్తులు ధరించారు కాని వాళ్లందరూ మీ వైపే చూస్తున్నారు.'



9. 'బీర్బల్, నిజంగా నీవు ఘటికుడివే..' అన్నాడు రాజు. 'కృతజ్ఞతలు ప్రభూ' అన్నాడు బీర్బల్‌సంతోషంతో తలాడిస్తూ.

మెంతులు లేదా మెథి దాదాపు అందరికీ తెలిసిన మొక్క. ఇది ఒక చిన్న మొక్క. ఈ మొక్క తెల్ల పూలు, 10 లేదా 20 చిన్న, సమతలంగా ఉన్న పసుపురంగులోని ఘాటైన, పరిమళభరితమైన గింజలను కలిగి ఉంటుంది. మెంతులు విటమిన్‌లను, ఖనిజాలను సమృద్ధిగా కలిగి ఉంటాయి. వీటిలో ప్రొటీన్‌లు కూడా ఎక్కువే ఉంటాయి. భారతీయ వంటల్లో మెంతులను బాగా ఉపయోగిస్తారు. దీని ఔషధ గుణాల గురించి ఆయుర్వేదం విశేషంగా వర్ణించింది.

రక్తంలో గ్లూకోస్ స్థాయిలను తగ్గించే దీని సామర్థ్యం కారణంగా మెంతులు మధుమేహవ్యాధి చికిత్సకి చాలా ఉపయోగకరంగా ఉంటాయి. పథ్యరూపంలోని ఫైబర్‌కి దీని ఆకులు అద్భుతమైన వనరుగా ఉంటాయి. మెంతులను క్రమం తప్పకుండా తీసుకున్నట్లయితే రక్తహీనతను నయం చేస్తాయి. ఈ ఆకులను దంచి పూతను పూసినట్లయితే చర్మం వాపును తగ్గించుకోవచ్చు.

# మహర్షుల వర్ణ చిత్రాలు

ఈ నెల చందమామలో మహర్షుల వర్ణ చిత్రాలతో స్క్రాప్ బుక్‌ను తయారు చేద్దాము రండి.



వాల్మీకి



అగస్త్యుడు



అత్రి



దుర్వాసుడు



చైతన్యుడు



భృగు మహర్షి

